




















గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...
మజాయే మజా!



జెమ్స్‌తో పొదిగాగా నా నావ
పయనిస్తా దాన్లో అద్భుత లోకంలో
తెస్తానిక మరెన్నెన్నో జెమ్స్
నీకోసం నాకోసం మనకోసం



చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరిస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరిస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

OBM/8341

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''అసూయ'']కు ఆధారం ''వసుంధర'' రచన. కష్టంలో వున్న వాళ్ళకు, నిస్వార్థబుద్ధితో తమకు చేతనైనంతలో సాయపడడం ఉత్తమ ధర్మం అనిపించుకుంటుంది. అలాంటి ధర్మబుద్ధిగల యిద్దరు యువకులను గురించి, ''ప్రాణదాతలు'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

నీచాశ్రయో న కర్తవ్యః, కర్తవ్యో మహదాశ్రయః,
ఈశాశ్రయో మహానాగః, పప్రచ్ఛ గరుడం సుఖమ్.

[అల్పులను ఆశ్రయించడం కంటె, శక్తిమంతులను ఆశ్రయించడం మేలు. శివుడిని ఆశ్రయించిన సర్పం, గరుడుడంతటి వాణ్ణి, క్షేమమా అని అడిగి అవమానించింది.]

సంపుటి 70 మే '82 సంచిక 5

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# బయటపడిన ద్రోహం

విశాఖు డనే వ్యాపారి వద్ద, పదహారేళ్ళ కుర్రవాడు చలపతి పని చేస్తూండేవాడు. వాడు పనిలో చేరిన కొద్ది రోజులకే, యజమాని నుంచి మంచి విశ్వాసపాత్రుడన్న పేరూ, మన్ననా పొందగలిగాడు. విశాఖుడు వ్యాపారానికి సంబంధించిన పనులు - ముఖ్యంగా బాకీల వసూళ్ళ లాంటి వ్యవహారాలు వాడిమీద పెట్టి, నిశ్చింతగా వుండేవాడు.

ఒకసారి పొరుగూరిలో వున్న వ్యాపారి గోపయ్య అనే అతను, విశాఖుడికి పెద్ద మొత్తం బాకీ యివ్వతేలాడు. ఆయన ఆ డబ్బు వసూలు చేసుకువచ్చే పని చలపతికి అప్పగించాడు. ఉదయం బయలుదేరి వెళ్ళితే, సాయంత్రానికి ఆ ఊరునుంచి తిరిగిరావచ్చు.

చలపతి సూర్యోదయంతోనే బయలుదేరి, మధ్యాహ్నానికల్లా ఆ ఊరు చేరాడు. వ్యాపారి తాను విశాఖుడికి యివ్వవలసిన ఐదువేల రూపాయిల మొత్తాన్ని అతడికి యిచ్చాడు. ఆ డబ్బు మూట కట్టుకుని చలపతి తిరుగు ప్రయాణమయ్యాడు.

ఆ రెండు ఊళ్ళమధ్యా ఒక పెద్ద వాగు వున్నది. వర్షాకాలంలో తప్ప సాధారణంగా అందులో నీరుండదు. కాని, ఒక్కొక్కసారి దూరంగా వున్న కొండల్లో వాన పడడం జరిగితే, ఆ నీరు ఉప్పెనలా హఠాత్తుగా వచ్చి వాగులో ప్రవహిస్తుంది.

మోకాటి లోతున్న వాగు నీటిని దాటి చలపతి ఒడ్డు చేరుతున్న సమయంలో, కొండల వైపునుంచి పెద్దహోరు వినిపించింది. వాడు ఆశ్చర్యపోతూ అటుకేసి చూసేంతలో, ఉరకలు వేస్తూ వరదనీరు వాగులో ప్రవహించ సాగింది. చలపతి చప్పున ఒడ్డెక్కి, దూరంగా పోయి నిలబడ్డాడు.

బొమ్మిడి అచ్చారావు

క్షణాలమీద ఆ ప్రదేశమంతా జల మయమైపోయింది. ప్రవాహంలో కొట్టుకుపోయే విరిగిన చెట్లకొమ్మలతో పాటు, కొద్ది దూరంలో యిద్దరు మనుషులు మునుగుతూ, తేలుతూ కొట్టుకుపోతూం డడం చలపతి కంటబడింది.

ఊరు సమీపిస్తుండగా వాడి మనసులో ఒక దురాలోచన మెదిలింది. తన దగ్గిర యిప్పుడు చాలా ధనం వున్నది. ఒక చిన్న అబద్ధంతో దాన్ని సునాయాసంగా తనదిగా చేసుకోవచ్చు!



చలపతి సమీపంలో వున్న ఒక చెరువులో మునిగి, తడిబట్టలతో సరాసరి దుకాణానికి వెళ్ళాడు. విశాఖుడు వాణ్ణి చూసి కంగారుపడుతూ, "ఏం జరిగింది? ఈ తడిబట్టలేమిటి?" అని అడిగాడు.

చలపతి విచారంగా ముఖం పెట్టి, "అయ్యా, నేను దారిలో వున్న వాగు దాటుతుండగా హఠాత్తుగా వరద వచ్చేసింది. దాంట్లో పడి కొంతదూరం కొట్టుకుపోయి, ఎలాగో ఒడ్డున పడగలిగాను," అన్నాడు.

"పెద్ద గండం నుంచి బయటపడ్డావు. అదృష్టవంతుడివి!" అన్నాడు విశాఖుడు తృప్తిగా.

"కాని, అయ్యా...." అంటూ చలపతి యీసారి ఏడ్పు ముఖం పెట్టాడు.

విశాఖుడు కారణం తెలియక, వాడి కేసి ఆశ్చర్యంగా చూశాడు.

"చాలా నష్టం జరిగింది. ప్రాణం కాపాడుకునే ప్రయత్నంలో, గోపయ్యగారి నుంచి వసూలు చేసిన ఐదు వేల డబ్బు మూటనూ వరదలో పోగొట్టుకున్నాను," అన్నాడు చలపతి.

విశాఖుడు నివ్వెరపోయాడు. ఐదు వేలు, చాలా పెద్ద మొత్తం! అయినా, ప్రాణరక్షణ చేసుకునే సమయాల్లో, డబ్బు సంగతి ఎవరికీ గుర్తుండదు.

"సరే, జరిగిందేదో జరిగింది. ఇంటికి పోయి పొడిబట్టలు వేసుకురా, అట్టే విచారపడకు," అన్నాడు విశాఖుడు.



డబ్బు విషయమై గట్టిగా నిగ్గదీసి వుండే వాణ్ణి,'' అన్నాడు.

గోపయ్య విస్తుపోయాడు. అతడు చలపతికి ఐదువేలూ యిచ్చి, వాడు బయలుదేరి పోయాక, వాగు అవతల వున్న గణపవరం వెళ్ళవలసిన పని పడి, కొంచెం వెనగ్గా వచ్చాడు. అతడు వాగు దాటుదామను కుంటూండగా, హఠాత్తుగా వరద వచ్చింది. అంతకుముందే చలపతి వాగుదాటి, అవతలి ఒడ్డున నిలబడి వున్నాడు. అదిచూసి గోపయ్య చాలా సంతోషించాడు కూడా.

జరిగింది ఇది. అయితే, చలపతి తన యజమానికి ఏదో కట్టుకథ చెప్పి, ఐదు వేలూ తస్కరించాడు! తన నౌకరు నిజాయితీమీద విశాఖుడికున్న నమ్మ కాన్ని మాటలతోకాక, చేతలతో రుజువు చేసి పోగొట్టాలనుకున్నాడు గోపయ్య.

ఇందుకు అతడొక పథకం ఆలోచించి విశాఖుడితో, ''నువ్వు చాలా పెద్దమనిషివి గనగ సరిపోయింది, అదే మరొకరైతే, నేనే చలపతి చేతిలో ఏ వంద రూపా యిలో పెట్టి, డబ్బు వరదలో కొట్టుకు పోయిందని చెప్పించాననుకునేవాళ్ళు,'' అన్నాడు.

విశాఖుడు నవ్వి, ''నా నౌకరు మీద నా కెంత విశ్వాసం వున్నదో, తోటివర్తకుడి

చలపతి వెళ్ళిపోయాడు. నాలుగు రోజుల తరవాత బాకీ చెల్లించిన పొరు గూరి వర్తకుడు గోపయ్య విశాఖుడి దుకాణం దగ్గిరకు వచ్చి, ''డబ్బు అందింది కదా, నే ఎరిగున్న కుర్రవాణ్ణే పంపావనుకో,'' అన్నాడు.

ఆ సమయంలో చలపతి దుకాణంలో లేడు. విశాఖుడు, గోపయ్యకు తాను చలపతి నుంచి విన్న సంగతులు చెప్పి, ''గోపయ్యా, ఒకక్షణం పాటు వాడి మాటల్లో ఏదో మోసం వున్నదన్న అను మానం కలిగినమాట నిజం. వాగుకు హఠాత్తుగా వరద వచ్చిన సంగతి, యితర్ల ద్వారా కూడా విని వుండకపోతే, వాణ్ణి

వైన నీ మీద కూడా అంత విశ్వాసం వున్నది,'' అన్నాడు.

''అలాగా! అయితే, నేను నీ నౌకరు చలపతి కన్న మరింత నమ్మకస్థుణ్ణనీ, విశ్వాసపాత్రుణ్ణనీ రుజువుచేయ దలిచాను. ఇవాళ రాత్రి తొమ్మిది గంటల ప్రాంతాన కాస్త వేషం మార్చుకుని, శివాలయం ఆవరణం లోని మారేడు చెట్టు కింది చీకట్లో నిలబడు. నేను, ఆ పక్కనే వున్న నందివర్ధనం పొదల మాటున దాగి వుంటాను. ఏం జరుగుతుందో చూద్దువుగాని,'' అన్నాడు గోపయ్య.

విశాఖుడు ఆశ్చర్యపోతూ, ''ఇదంతా ఏమిటి? చెప్పదలిచిందేమైనా వుంటే సూటిగా చెప్పరాదా,'' అన్నాడు.

''అలా చెబితే అర్థంకాదనే, నిన్ను శివాలయం దగ్గిరకు రమ్మంటున్నాను, మరిచిపోకు!'' అంటూ గోపయ్య వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం చీకటి పడుతూండగా అతడు చలపతి ఇంటికి వెళ్ళి, వాణ్ణి కేకవేసి పిలిచాడు. చలపతి తలుపు తెరుస్తూనే గోపయ్యను చూసి గతుక్కుమన్నాడు,

గోపయ్య ఎంతో మృదువుగా, ''పాపం, ఆ రోజు నేనిచ్చిన బాకీడబ్బు వరదపాలయింది గదా!'' అన్నాడు.



చలపతి ముఖంలో భయం మాయమైంది వాడు బాధపడిపోతున్నట్టు, ''అవును, బాబుగారూ! యజమాని డబ్బు కాస్తా కూస్తా ఐదువేలు! ఏదో కొద్దిపాటి ఈత నేర్చినవాణ్ణి కావడంతో, వరద నీట్లో ఈది ఒడ్డున పడగలిగాను'' అన్నాడు.

గోపయ్య హేళనగా నవ్వి, ''ఈ దొంగ వేషాలు నా దగ్గిర సాగవు! నీ బుద్ధి ఎలాంటిదో తెలుసుకుందామని అలా అన్నాను. వాగులో వరదనీరు రాకముందే, నువ్వు అవతలి ఒడ్డు చేరడం చూశాను. కావాలంటే మరిద్దరి చేత సాక్ష్యం కూడా యిప్పించగలను,'' అన్నాడు.

చలపతి నిలువునా వణికిపోసాగాడు. గోపయ్య అతడి భుజం మీద చెయ్యి వేసి, "ఈ సంగతి మీ యజమానికి చెప్పను. అందుగ్గాను, ఆ ఐదువేలలో సగం నాకివ్వాలి, యిష్టమేనా ?" అన్నాడు.

చలపతి సరేనన్నట్టు తలవూపి, డబ్బు తెచ్చేందుకు వెళ్ళబోతూండగా, గోపయ్య అతణ్ణి ఆగమని, "నేను ఒక స్నేహితుణ్ణి చూడబోతున్నాను; వెంట డబ్బుమూట బరువుచేటు. తొమ్మిది గంటల ప్రాంతాన శివాలయం దగ్గిరకొచ్చి, అక్కడున్న మారేడు చెట్టు కింద నిలబడి వుంటాను, డబ్బు అక్కడికి పట్టుకురా !" అన్నాడు.

చలపతి రాత్రి తొమ్మిది గంటల వేళ డబ్బు తీసుకుని శివాలయానికి వెళ్ళాడు. అక్కడ చెట్టు కింద ఒక మనిషి నిలబడి వున్నాడు. చలపతి అతణ్ణి సమీపిస్తూనే, "గోపయ్యగారూ, అన్న ప్రకారం రెండున్నర వేలు తెచ్చి, నా మాట నిలుపుకున్నాను. మీరూ ఇదంతా నా యజమానికి చెప్పనన్నమాటనిలుపుకోవాలి," అన్నాడు.

ఈ మాటలు వింటూనే చీకట్లో నిలబడి వున్న విశాఖుడికి మతిపోయి నంత పనైంది. అతడు వచ్చే కోపాన్ని ఆపుకోలేక చలపతి చంప మీద ఛళ్ళుమంటూ కొట్టి, "ఒరే, నువ్వింత ద్రోహం తలపెడతావనుకోలేదు. నిన్నిప్పుడే రక్షకభటులకు వప్పగించగలను. కాని, చాలా కాలంగా విశ్వాసంతో సేవచేశావు, క్షమిస్తున్నాను. ఇకనుంచి మామూలు నౌకరుగా దుకాణం ఊడ్చడం, సరుకులు మోసుకురావడంలాంటి పనులు చెయ్యి." అన్నాడు.

అప్పటివరకూ దూరంగా నిలబడి వున్న గోపయ్య అక్కడికి వచ్చి, కింద పడి వున్న డబ్బు మూటను విశాఖుడికి యిస్తూ, చలపతితో, "ఆ మిగతా రెండున్నర వేలు కూడా మీ యజమానికే యివ్వు. నీకు యింత తక్కువ శిక్ష పడుతుందనుకో లేదు. మీ యజమాని దాతృత్వానికి చాలా సంతోషిస్తున్నాను," అన్నాడు.






## 7

[రాజు సింహాసనం పరిత్యజించాలని ప్రజలు చేసిన ఆందోళన చిత్రసేనుణ్ణి కలత పరిచింది. ఆయన హఠాత్తుగా రాజప్రాసాద మంటపం మీదినుంచి కిందకు దూకి ప్రాణత్యాగం చేశాడు. ప్రజలు ఉత్సాహంగా సమరసేనుడికి జైజై నినాదాలు పలికారు. సమరసేనుడు, నరవాహనుణ్ణి వెంటపెట్టుకుని, సైనికులతో శత్రువుల మీద దాడికి బయలుదేరాడు. తరవాత—]

శివదత్తుడు, మందరదేవుడితో యిలా చెప్పాడు:

''రెండు మూడు వందలమంది కాల్బల సైనికులకు ముందు, అర్ధచంద్రాకారంగా కొందరు అశ్వికులు కదలసాగారు. శత్రు అశ్వికులు హఠాత్తుగా కాల్బల సైనికుల మీద పడి చీకాకుపరచాలంటే, ముందు వారు సమరసేనుడి అశ్వసైనికులను ఎదుర్కొనవలసివుంటుంది గదా?''

''అవును, సమరసేనుడు తిరుగులేని యుద్ధవ్యూహం పన్నాడు,'' అన్నాడు మందరదేవుడు నవ్వుతూ.

''సమరసేనుడి ఈ కొత్త యుద్ధ తంత్రం శత్రువుల ఎత్తుగడలను తారుమారు చేసింది. క్రమక్రమంగా ముందుకు వస్తున్న సమరసేనుడి సేనావాహిని వాళ్లకు బెదురు పుట్టించి వుంటుంది. వాళ్ళు క్రమబద్ధంగా వెనకకు తగ్గసాగారు.

హఠాత్తుగా సమరసేనుడి సేనాముఖం నుంచి శంఖనాదాలూ, జయజయ ధ్వానాలు మార్మోగినై. అతి వేగంగా ముందు కురికిన అతని అశ్వసైనికులను శత్రుఆశ్వికులు ధైర్యంగా ఎదుర్కొన్నారు. ఈటెలూ, కత్తులూ ధరించిన ఆ అశ్వసైనికుల సంకుల సమరం వర్ణనాతీతం.

నాలుగైదు నిమిషాల్లో శత్రుఆశ్వికులు చెల్లాచెదురై అన్నివైపులకూ పరిగెత్తసాగారు. అదే క్షణంలో కాల్బలం శత్రువులపై కురికింది. విజయోత్సాహులైన సమరసేనుడి ఆశ్వికులు కూడా తమ యీటెలతో శత్రు కాల్బలం మీదికి లంఘించారు. పారిపోయేందుకు ఎటూ దారిలేని శత్రువులు ప్రాణాలకు తెగించి పోరాడసాగారు.

విజయలక్ష్మి సమరసేనుణ్ణి వరించనున్నదని నేను చాలా సంబరపడ్డాను. ఈ దెబ్బతో దేశంలో అరాజకం నశించి, ప్రశాంతత ఏర్పడగలదని కూడా నాకు నమ్మకం కలిగింది. అలాంటి శుభతరుణమే వచ్చిననాడు, నరవాహనుడి కుటిల రాజనీతివల్ల కుండలిఫీ ద్వీపంలో ఎవరూ బాధపడవలసిన అవసరం కలగదు.

నేను ఈ విధంగా ఆలోచిస్తున్నంతలో, శత్రు సైనికులు హాహాకారాలు చేస్తూ, చెల్లాచెదురుగా పారిపోవటం కనిపించింది. పారిపోతున్న ఆ సైనికులను, సమరసేనుడి ఆశ్వికులు వెన్నంటి తమ



యీ టెలతో హతమారుస్తున్నారు. ఇక కాల్బల సైనికులు గాయపడిన తమతోటి సైనికులకు కట్లుకట్టి సహాయపడుతు న్నారు. మరి కొందరు ఆ దాపులనే వున్న చిన్న వాగులో దిగి దాహం తీర్చుకుంటు న్నారు.

ఇక, నేను కోట బురుజు దిగి కిందకు వెళ్ళి, పట్టణ ద్వారాలు తెరిపించుదా మనుకున్నాను. విజయోత్సాహంతో మరలి రానున్న సమరసేనుడికీ, అతడి సైని కులకూ ఘనస్వాగతం ఇవ్వవలసిన బాధ్యత నా మీద వుంది. కాని నేను బురుజు మీది నుంచి వెనుదిరిగేంతలో సైన్యంలో విజయఘోషలకు బదులు, హాహాకారాలు బయలుదేరినై.

నేను క్షణకాలం నివ్వెరపడి అక్కడే నిలుచుండిపోయాను. యుద్ధరంగంలో కొంచెం మిట్టగా వున్న ఒక ప్రదేశం చుట్టూ సైనికులు పోగుకాసాగారు. ఏమిటా యీ విచిత్రపరిణామం అని నేను అను కునేంతలో పదిమంది అశ్వికులు హుటా హుటిని పట్టణ ద్వారాలకేసి తమ గుర్రా లను దౌడు తీయించసాగారు.

నా మనసు చాలా కలవరపడింది. అనుకోని విధంగా ఏదో దుష్టపరిణామం సంభవించిందని నేను భయపడ్డాను. పట్టణ ద్వారాలకేసి వస్తున్న ఆ పది మంది అశ్వికులూ, తప్పక వార్తాహరులై వుంటారన్న నమ్మకం కలిగింది. నేను గబగబా బురుజు నుంచి దిగి, నా గుర్రం






ఎక్కి, నా అనుచరులు వెంటరాగా, పట్టణ ద్వారం దగ్గరకు వెళ్ళి ద్వారాలు తెరిపించాను. ద్వారాలు తెరవటమే ఆలస్యంగా పదిమంది అశ్వికులూ వేగంగా ద్వారాలు దాటి పట్టణంలో ప్రవేశిస్తూ, ఒక్కుమ్మడిగా, ''నరవాహన మహారాజుకూ, జై!'' అంటూ అరిచారు.

ఏదో ద్రోహం జరిగిందని తక్షణం నేను గ్రహించాను. ''ద్రోహులు, నరకండి, హతమార్చండి!'' అంటూ నేను, నా గుర్రాన్ని ముందుకు ఉరికించి, కత్తితో ఇద్దరిని తుదముట్టించాను. నా అనుచరులు కూడా తమ గుర్రాలను ముందుకు ఉరికించి, మిగిలిన ఆ ఎనిమిదిమంది నరవాహన పక్ష అశ్వికులను ఎదిరించారు.

వీధుల వెంట బారులుతీరి నిలబడ్డ సైనికులూ, ఆయుధధారులైన ప్రజలూ ఒక తృటికాలం స్థాణువుల్లా వుండిపోయారు. ఆ వెంటనే సైనికుల్లో నుంచి కొందరు, ''నరవాహన మహారాజుకూ, జై!'' అంటూ కత్తులు దూసి ముందుకురికారు.

ఆయుధధారులైన ప్రజల్లో కలకలం బయలుదేరింది. వాళ్ళల్లో నుంచి కొందరు యువకులు ముందుకువచ్చి, ''సమర సేనుడికీ, జై!'' అంటూ సైనికుల మీద కలియబడ్డారు.

ఇక అప్పుడు చెలరేగిన గందరగోళాన్ని యుద్ధమనేందుకు వీల్లేదు. ఆయుధధారి అయిన ప్రతివాడికీ, ఆయుధం ధరించి వున్న మరొకడు శత్రువు! తన పక్కన, మరొకడితో కత్తియుద్ధం చేస్తున్నవాడు మిత్రుడో, శత్రువో ఆ పక్కవాడికి తెలీదు. కొందరు సమరసేనుడికీ, మరికొందరు నరవాహనుడికీ జైజై నినాదాలు చేస్తున్నారు. ఆ కల్లోలంలో ఎవరినోటి నుంచి, ఏ నినాదం వచ్చిందో స్పష్టంగా విని, వాణ్ణి శత్రువు కిందో, మిత్రుడి కిందో పోల్చుకునేందుకు అవకాశం లేదు.

నేను, పోరాటం సాగిస్తూనే, అనుచరులతో క్రమంగా కోటద్వారం కేసి తిరోగ

మించాను. ద్వార రక్షకులు నన్ను చూస్తూనే కోట ద్వారం తెరిచి, నేను లోపల ప్రవేశించగానే, ద్వారం మూసేశారు. ఈ విధంగా ఆ గందరగోళాన్నించి బయటపడి కోటలో ప్రవేశించాను.

బయట వీధుల్లో సంకుల సమరం సాగుతున్నది. సైన్యంలో కొంత భాగం, ప్రజలూ సమరసేనుడి పక్షం; మిగతా సైన్యం నరవాహనుడి పక్షం. యుద్ధ రంగంలో వాస్తవంగా ఏం జరిగిందో తెలుసు కుంటే తప్ప, లేకపోతే యీ గందరగోళం ఇలాగే సాగుతుందనిపించింది. నా అను చరుల్లో ఒకణ్ణి పిలిచి, రహస్య ద్వారం గుండా అతణ్ణి యుద్ధభూమి కేసి పంపాను. పోతే, ఇప్పుడు తెలియవలసింది, పట్టణం లోని నరవాహనుడి అనుచరుల ముందు కార్యక్రమం. వాళ్ళు తమను ఎదిరించే వాళ్ళను మట్టుపెట్టిం తరవాత, కోటను వశపరుచుకునేందుకు ప్రయత్నిస్తారా అన్నది సమస్య! నేను మాత్రం, నా సర్వ శక్తులా కోటను రక్షించదలిచాను. నా కొద్ది మంది అనుచరులూ, కోటలో వున్న నలభై యాభైమంది సైనికులూ కోట రక్షణకు ఎంతోకాలం నిలబడలేరని నాకు తెలుసు. అంత గత్యంతరం లేనప్పుడు, లోగడ చేసిన విధంగా క్రూరమృగాలను బోనుల్లో నుంచి వదలటం తప్ప మరొక మార్గాం



తరం ఎంత ఆలోచించినా తోచలేదు. ఒక గంటకాలం గడిచింది. బయట వీధుల్లో ఇంకా పోరాటం సాగుతూనే వుంది. నేను కోట రహస్యద్వారం నుంచి పంపిన సైనికుడు కొద్దిసేపటికి తిరిగి వచ్చాడు. అతడు యుద్ధరంగం నుంచి తెచ్చిన దుర్వార్త నా హృదయాన్ని శూలంలా తాకింది.

శత్రువులతో జరిగిన పోరులో సమర సేనుడు బాగా గాయపడ్డాడు. దానితో అంతవరకూ ఉపసేనానిగా వున్న నర వాహనుడు, సేనానాయకత్వం స్వీకరించి, కుండలినీ ద్వీపానికి రాజుగా ప్రకటించు కున్నాడు.



అ వార్త తమ వాళ్ళకు చెప్పేందుకే అతడి అనుచరులు కొందరు నగరంలో ప్రవేశించారు!

"సమరసేనుడి పరిస్థితి ఎలా వుంది? మాట్లాడేస్థితిలో ఉన్నాడా లేడా?" అని అడిగాను, వార్త తెచ్చిన సైనికుణ్ణి.

"ఆయన బాగా గాయపడ్డాడు. ఇప్పుడో ఇంకా సేపటికో అన్నట్టుగా ఉంది ఆయన స్థితి. ఆ అదను తీసుకునే, నరవాహనుడు రాజుగా ప్రకటించుకున్నాడు. సేనలోని చిన్న చిన్న నాయకులందరూ అతణ్ణి బలపరచడమే కాకుండ, సైనికులను కూడగట్టుకుంటున్నారు," అన్నాడు సైనికుడు.

పరిస్థితి చేజారి పోయిందని నేను గ్రహించాను. కొద్దిసేపట్లో నరవాహనుడే తన సైనికులతో స్వయంగా నగరం మీదికి వస్తాడు. ఇక అప్పుడు అతణ్ణి ఎదిరించే శక్తి కుండలినీ ద్వీపంలో ఎవరికీ వుండదు. అతడికి నేనంటే వున్న ద్వేషం కూడా నాకు తెలియంది కాదు. వీటన్నిటి దృష్ట్యా, సాధ్యమైనంత తొందరగా కోటను వదిలి, రహస్య ద్వారం గుండా నా అనుచరులతో సహా బయటపడటం మంచిదనుకున్నాను.

నా అనుచరులందర్నీ ఒక చోట చేర్చి, పరిస్థితి వివరించాను. నా అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు. ఇక చేయవలసిందల్లా గుట్టు చప్పుడు కాకుండా రహస్య ద్వారాన్నుంచి బయటపడటం. కోటనుంచి బయటికి అలాంటి రహస్యద్వారం వున్నదన్న సంగతి నరవాహనుడికి తెలియంది కాదు. అందుచేత ఎంతో జాగ్రత్తగా పని నెరవేర్చుకోవలసి వుంటుంది.

నా అనుచరులందరినీ హెచ్చరించి ప్రాసాదం లోపలికి బయలుదేరాను. నేను అలా కొద్ది దూరం వెళ్ళానో లేదో, ద్వారం వేపు నుంచి కేకలు వినిపించినై. వెనుదిరిగి చూతును గదా, నరవాహనుడి పక్షసైనికులు కొందరు, ద్వారాని కున్న ఇనుప కమ్ములను పెద్ద పెద్ద దుంగలతో

బాదుతూ, వాటిని విరగ గొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

నాకు చప్పున ఒక ఉపాయం తోచింది. లోగడ చేసిన విధంగానే, మృగశాలాధిపతిని పిలిచి క్రూరమృగాలను బోనుల్లో నుంచి వదలమని ఆజ్ఞాపించాను. అతడు నా కేసి చిరునవ్వు నవ్వి, "శివదత్తా! నీ శత్రువు లెవరో నాకు తెలియదు కాని, వాళ్ళు మాత్రం నీ కన్న తెలివైనవారు. గంట కింద వాటి మేత విషయం పర్యవేక్షించేందుకు బోనుల దగ్గిరకు వెళ్లాను. వాటిల్లో కొన్ని చచ్చిపోయి వున్నవి. కొన్ని బాధతో మూలుగుతున్నవి," అన్నాడు.

నేను మారు మాటాడకుండా, బోనుల దగ్గరకు పరిగెత్తాను. మృగశాలాధిపతి చెప్పిన మాటల్లో అసత్యం ఏమీలేదు. అయితే, జంతువులకు విషం పెట్టినది ఈ మృగశాలాధిపతా? లేక మరెవరైనా నరవాహనుడి అనుచరుడా? నా కున్న కొద్దిపాటి వ్యవధిలో ఆ నిజానిజాలు తెలుసుకునే అవకాశం లేదు. ఎందుకయినా మంచిదని మృగశాలాధిపతిని పెడరెక్కలు విరిచి కట్టించి, ఒక గది మూల పడవేసి, నేను రహస్యదార్వం కేసి పరిగెత్తాను.

రహస్యద్వారం చిత్రసేన మహారాజు శయనాగారంలో వున్నది. అక్కడి నుంచి ఒక సన్నని సొరంగం ప్రారంభమై కోట చుట్టూ వున్న అగడ్త కిందుగా పోయి, బయట క్రోసు దూరంలో వున్న అడవిలో ఒక పెద్ద మాను బోదెలో అంత మవుతుంది.

నా అనుచరులతో నేను చిత్రసేనుడి శయనాగారం ప్రవేశించేసరికి, ఆ మహారాజు భౌతికకాయం మాట గుర్తు కొచ్చింది. పాపం, ఇంతవరకూ దహనసంస్కారం లేకుండా ఆ శవం ఎక్కడో ఒక గదిలో పడి వుంది. అతడి పరిపాలనా, చావూ— అంతా విషాదాంతంగా పరిణమించింది.

రహస్య ద్వారం తెరిచి, ముందుకు చూశాను. అంతా కారు చీకటిగా వుంది!

—(ఇంకా వుంది)





# అసూయ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి, భుజానవేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, నిన్ను ఎడతెగని యీ కఠోర మైన శ్రమకు గురిచేసినవాడి మనస్తత్వం ఎలాంటిదై వుంటుదన్న అనుమానం కలుగుతున్నది. లోకం అసూయాపరుల పుట్ట. దీనావస్థలో వున్నవాళ్ళపై జాలి తప్ప, గౌరవం ఎవరికి వుండదు. నాగన్న అనే అతిసామాన్యుడికి మొదట సాయ పడి, తరవాత అసూయతో కుమిలి పోయిన వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

ఇరవైఏళ్ళ వయసు వాడైన నాగన్న కట్టుగుడ్డలతో వీరవరం వచ్చాడు. అతడికి

## బేతాళ కథలు



ఆరంభంలో ఆదిశేషయ్య అనే రైతు ఆశ్రయమిచ్చాడు. ఆయన చెప్పినమీదట మునసబు నాగన్నకు నాలుగెకరాల పొలం కౌలుకిచ్చాడు.

నాగన్న యిటు వ్యవసాయం చేస్తూనే, తీరిక సమయాల్లో గ్రామంలోని యితరులకు పనిపాటుల్లో సాయపడేవాడు. రెండేళ్ళు గడిచేసరికి అతడు సొంతానికి రెండెకరాల పొలం కొన్నాడు. నాగన్న సాధించిన అభివృద్ధికి ఆదిశేషయ్య ఎంతగానో సంతోషించి, అతడికి వ్యవసాయంలోని మెలుకువలు నేర్పాడు. ఆదిశేషయ్యకు పదెకరాల మాగాణీ, అయిదెకరాల మామిడితోటా వున్నవి.

కొద్ది కాలం తరవాత ఆ ఊళ్ళోని మోతుబరి శరభయ్య, తన కూతురు లక్ష్మని నాగన్న కిచ్చి పెళ్ళిచేస్తానన్నాడు. శరభయ్యకు పాతికెకరాల మాగాణీ, పదెకరాల పళ్ళతోటలూ వున్నవి. ఆయనకు ఒక్కతే కూతురు. నాగన్న తెలివితేటలూ, పొదుపరితనం ఆయన కెంతో నచ్చాయి.

నాగన్న ఆదిశేషయ్యను సలహా అడిగాడు. ఈ పెళ్ళి చేసుకుంటే, నాగన్న తనకంటే ఆస్తిపరుడై పోతాడని ఆదిశేషయ్య భయపడ్డాడు.

"నాగన్నా, ఇల్లరికపుటల్లుడుగా బతకడం కంటే, మగాడికి నీచమైనది మరేం లేదు. బాగా ఆలోచించుకో! నాకుమాత్రం, యీ పెళ్ళి యిష్టంలేదు," అన్నాడాయన.

నాగన్న యీ సంగతి శరభయ్యకు చెప్పాడు. శరభయ్య తాపీగా, "నాగన్నా, నా కూతురు లక్ష్మి, నిన్ను చేసుకోవాలనుకుంటున్నది. నువ్వు, ఇల్లరికపుటల్లుడుగా వుండనక్కరలేదు. మొత్తం ఆస్తి నీపేర రాస్తాను. నీదయమీదే నేను బతుకుతాను. ఈ పెళ్ళికి కాదనకు!" అన్నాడు.

నాగన్న ఒప్పుకున్నాడు. అతడికీ, లక్ష్మికీ వైభవంగా వివాహం జరిగిపోయింది. ఆ రోజునుంచీ ఆదిశేషయ్య, నాగన్నతో మాట్లాడడం మానేశాడు.

నాగన్న బాధపడి, ఒకనాడు ఆదిశేషయ్య ఇంటికివెళ్ళి, "నేనేదైనా తప్పు చేస్తే క్షమించండి. నేనింతవాడినయ్యా నంటే, అందుకాకారణం మీరే! మీ ఆదరణ లేకుంటే ఈ ఊళ్ళో ఒక్కక్షణం కూడా వుండను," అన్నాడు.

ఆదిశేషయ్య, నాగన్న వినయానికి సంతోషించి, "నా ఉపకారం సంగతి యింకా గుర్తుంచుకున్నావా? నువ్వింకా వృద్ధిలోకి రావాలి," అంటూ దీవించాడు.

ఆ సంవత్సరం అదునుకు వానలు పడక పంటలు దెబ్బతినిపోయినై. నాగన్న ముందే తగుజాగ్రత్తలు తీసుకున్న కారణంగా, అతడి పొలాలు మాత్రం బాగా పండినై. ఆదిశేషయ్య పొలాలు దెబ్బతిని పోవడంతో, ఆయనకు నాగన్న అంటే అసూయ పుట్టుకొచ్చింది.

సంగతి తెలిసిన నాగన్న, ఒకరోజున ఆదిశేషయ్య ఇంటికి వెళ్ళాడు.

"నీ ధోరణి నాకు నచ్చలేదు, నాగన్నా! వ్యవసాయంలో చాలా త్వరగా ఆరితేరావు. కానీ, నువ్వు స్వార్థపరుడివి. వ్యవసాయంలో నాకు తెలిసిన మెలకువలన్నీ నీకు చెప్పాను. నువ్వు మాత్రం నా కేమీ చెప్పడంలేదు," అన్నాడు ఆదిశేషయ్య కోపంగా.

నాగన్న వినయంగా, "నా పొలాలు బాగా పండడంలో, నా గొప్ప ఏమీలేదు. అంతా తమ దీవెనల బలం! అదృష్టం కలిసివచ్చింది," అన్నాడు.





నాగన్నకు కవిత్వమంటే యిష్టం. అతడు కొన్నాళ్ళపాటు కావ్యపఠనం చేసి, తనూ ఒక కావ్యం రాసి, గ్రామస్థులకు వినిపించాడు. అంతా విన్న పండితుడొకా యన, ఆ కావ్యమంతా తప్పులతడక అని ఎగతాళి చేశాడు. గ్రామస్థులంతా నవ్వారు. జరిగినదానికి ఆదిశేషయ్య లోలోపల సంతోషించాడు.

అయితే, నాగన్న పట్టుదల వదలలేదు. అతడు అదేరోజున పండితుడి ఇంటికెళ్ళి, "అయ్యా, తమరు ఎగతాళి చేశారని నాకు బాధలేదు. మీరు కోరిన డబ్బిస్తాను. నా కావ్యంలోని తప్పులు ఎత్తి చూపండి! నాకు మంచి భాష నేర్పండి," అని అడిగాడు.

పండితుడు నాగన్నను ప్రోత్సహించ దలచక, "పాండిత్యంతో కవిత్వాన్ని సాధించలేవు. కవిత్వం నీకు పుట్టుకతో రావాలి," అన్నాడు.

ఆ మాటలకు నాగన్న నిరుత్సాహ పడకుండా, పండితుడి వద్ద శిష్యరికం చేసి, ఆరు నెలల్లో తన భాషను మెరుగు పరుచుకున్నాడు. తర్వాత వివిధ కవులు రాసిన గ్రంథాలు చదివి కవిత్వంలోని మెలుకువలు తెలుసుకున్నాడు.

ఏడాది తిరక్కుండానే నాగన్న మళ్ళీ మరో కావ్యం రాసి పండితుడికి చూపిం

ఈ జవాబుకు ఆదిశేషయ్య చాలా ఆనందపడిపోయి, తిరిగి మామూలుగా నాగన్నతో మాట్లాడడం ప్రారంభించాడు. అయితే, ఎల్లకాలమూ నాగన్న వ్యవ సాయప్పనుల్లోనే మునిగి వుంటే, అతను కొన్నాళ్ళకు ఊరిసే కొనివెయ్య గలడని ఆయనకు అనుమానం కలిగింది.

ఒక రోజున ఆయన నాగన్నతో, "నాగన్నా, నువ్వు బాగా సంపాయించావు. ఇంకా ఎందుకు రాత్రింబవళ్ళు శ్రమపడడం? నీ దృష్టి కళలపైకి మరల్చడం బావుంటుంది. స్వతహాగా తెలివైనవాడివి! ప్రయత్నించావంటే, నీపేరు దేశంలో ప్రసిద్ధికెక్కుతుంది," అన్నాడు.

చాడు. "ఇప్పుడు నీ భాష మెరుగయింది. ఇందులో తప్పులేం లేవు. అంత మాత్రాన ఇది గొప్ప కావ్యం కాదు," అన్నాడు పండితుడు.

ఆ మాత్రం మాట చాలు ననుకుని, నాగన్న మర్నాడు తన కావ్యాన్ని గ్రామస్థులకు వినిపించాడు. అయితే, అప్పుడొక విచిత్రం జరిగింది! మారువేషంలో దేశాటన చేస్తున్న ఆ దేశపు రాజు, జనం మధ్య వుండి ఆ కావ్యం విన్నాడు. ఆయనకది ఎంతగానో నచ్చింది.



రాజు అప్పటికప్పుడు తనెవరైందీ జనానికి చెప్పి, "ఎందరో కవులు సంస్కృత కావ్యాలను తెలుగులోకి అనువదించారు. కాని, ఏ ఆధారం లేకుండా తెలుగులోనే రాయబడ్డ యింత గొప్ప కావ్యం నేను వినడం, యిదే ప్రథమం. నువ్వు రాజధానికి వస్తే, తగినవిధంగా సత్కరిస్తాను," అన్నాడు నాగన్నతో.

ఇది విని, చాలామంది ఆశ్చర్యపోయారు. పండితుడూ, ఆదిశేషయ్యా నాగన్నతో మాట్లాడడం మానివేశారు. నాగన్న వారి ఇళ్ళకు వెళ్ళి, అదంతా వారి చలవే అని చెప్పిన తరవాత, వాళ్ళ అసూయ శాంతించింది.

నాగన్న రాజసన్మానానికి వెళుతూ, తనతోపాటు ఆదిశేషయ్యనూ, పండితుణ్ణీ తీసుకుపోయాడు. అతడు చెప్పిన మీదట నాగన్నతోపాటు, వారికీ సన్మానం జరిగింది. నాగన్న కారణంగా ఆదిశేషయ్యకూ, పండితుడికీ ఘనసన్మానం జరగడం వల్ల, వాళ్ళిద్దరికీ అతనంటే గౌరవాభిమానాలు ఏర్పడ్డాయి. ఆ తర్వాత వాళ్ళు, నాగన్నను చూసి అసూయపడడం మాని, అతడికి వస్తున్న పేరుప్రఖ్యాతులు చూసి సంతోషించసాగారు.

ఈ స్థితిలో ఒకరోజు నాగన్న భార్యతో, "ఇక, మనం ఈ ఊళ్ళో ఎంతోకాలం వుండలేం. మరేదైనా ఊరు పోవలసిందే. ఆస్తిపాస్తులు అమ్మివేసే ప్రయత్నం చేస్తున్నాను," అన్నాడు.

నాగన్న భార్యకు ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, నాగన్న ప్రవర్తన వింతగానూ, అసందర్భంగానూ లేదా? ఇప్పుడు ఊళ్ళో ప్రతి ఒక్కరూ అతణ్ణి అభిమానిస్తున్నారు గదా! అతడు ఒకవేళ ఊరు వదలదలిస్తే, తనంటే అసూయపడేవాళ్ళున్న రోజుల్లోనే వదలవలసింది. మరిప్పుడెందుకు వదిలిపోతున్నట్టు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నాగన్న లాంటి బుద్ధిబలం, పట్టుదలా వున్న వ్యక్తులు చాలా అరుదుగా వుంటారు. ఎవడైనా నీటివాలున పడి ఈదుకుంటూ సునాయాసంగా ఏరు దాటవచ్చు. కాని, నాగన్న లాంటి వాళ్ళు ఏటికి ఎదురీదే తత్వం గలవాళ్ళు. అలాంటి వాళ్ళకు జీవితమార్గంలో ఎప్పటికప్పుడు, ఏదో ఒక ప్రతిబంధకం అడ్డునిలవాలి. అలాంటిది లేనప్పుడు వాళ్ళకు జీవితం నిస్సారంగా కనబడుతుంది. ఊళ్ళో ఆదిశేషయ్య అసూయా, పండితుడి హేళనా కారణంగానే నాగన్న తీవ్రమైన కృషి చేసి, అటు వ్యవసాయంలో దిట్ట అనిపించుకుని, యిటు కవిగా కూడా రాజసత్కారం పొందగలిగాడు. అతడికి యింకా గొప్పవాణ్ణి కావాలన్న కోర్కె వున్నది. తను ఉన్న ఊళ్ళో అతడింతవరకూ చూసింది అసూయాపరుల్నే; ప్రత్యర్థుల్ని కాదు. ఆ అసూయాపరుల్ని స్తోత్రపాఠకులుగా చేసుకోగలిగాడు: తనలో యింకా పేరు ప్రతిష్ఠలు గడించాలనే కోర్కెకు తగినంత ప్రోద్బలం, యికముందు అసూయాపరుల నుంచి కాక, తనతో పోటీకి వచ్చే వాళ్ళ నుంచి రావాలి. అలాంటి వాళ్ళు తను వున్న ఊళ్ళో లేరు. అందువల్లనే నాగన్న మరొక చోటుకు పొదలిచాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# తెలివైన సన్యాసి

ఒక గ్రామంలో రామస్వామి, రంగస్వామి అనే యిద్దరు వ్యాపారస్థులుండేవాళ్ళు. వృత్తిరీత్యా సహజంగా వుండే పోటీ, క్రమంగా వాళ్ళిద్దరి మధ్యా శత్రుత్వానికి దారితీసింది.

ఒకసారి ఆ గ్రామం చెరువుగట్టు మీది మర్రిచెట్టు కింద ఒక సన్యాసి వచ్చి దిగాడు. గ్రామస్థులు అతణ్ణి చూడబోయి, తమకున్న బాధలు చెప్పుకుని, సహాయం కోరసాగారు. సన్యాసి వాళ్ళకు మంత్రించిన విభూదీ, తాయెత్తులూ యిస్తూండేవాడు. వాటివల్ల చాలామందికి మేలు కలగసాగింది.

ఒకనాటి సాయంత్రం వేళ రామస్వామి సన్యాసిని చూడబోయాడు.

''నాయనా, నీకున్న బాధలేమిటి? శారీరకబాధలా, గ్రహబాధలా?'' అని అడిగాడు సన్యాసి.

''స్వామీ, అలాంటి బాధలేం నాకు లేవు. ఒక దుర్మార్గుడు నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నాడు; వాడు రంగస్వామి అనేవాడు. దుర్మార్గుల్ని నష్టపడేలా చేయడం అన్యాయం కాదు గదా!'' అన్నాడు రామస్వామి.

సన్యాసికి అతడి మాటలేమీ అర్థం కాక, ''ఆ చెప్పదలిచిందేమిటో సూటిగా చెప్పు, నాయనా! నీ రహస్యం నేనెక్కడా బయట పెట్టనులే,'' అన్నాడు.

''ఈ గ్రామంలో రంగస్వామి అనే వ్యాపారి ఒకడున్నాడు. వాడు పరమ దుష్టుడు. వాడు బాగా నష్టపడేటట్టుగా నాకు తమరు ఒక మంత్రం ఉపదేశించండి,'' అన్నాడు.

సన్యాసి ఒక క్షణం నివ్వెరపడి, ''నువ్వు అంతగా కోరరాని కోర్కె కోరుతున్నావు. అయినా అవతలివాడు, దుష్టు

ఖైరి సత్యనారాయణ

దని చెపుతున్నావు గనక ఫరవాలేదు. ఆ రంగస్వామి వెయ్యి రూపాయల నష్టం పాలయ్యాడనుకో, అది నీకు సంతోషం కలిగిస్తుందా?'' అన్నాడు.

''వెయ్యి రూపాయలు నష్టమే! నేనైతే ఏమైనా తట్టుకోగలనేమో కాని, వాడికి మాత్రం నడుం విరిగినట్టే,'' అన్నాడు రామస్వామి ఉత్సాహంగా.

''అయితే ఈ రాత్రికి ఒక మంత్రం పఠించి, ఒక యంత్రం తయారుచేస్తాను. దానికి వెయ్యి రూపాయలు ఖర్చవుతుంది,'' అన్నాడు సన్యాసి.

రామస్వామి ఇంటికి పోయి, ఆ మొత్తం తెచ్చి సన్యాసికిచ్చాడు. సన్యాసి అతణ్ణి మర్నాటి సూర్యోదయంవేళ రమ్మన్నాడు.

రాత్రి కొంచెం పొద్దుపోయాక రంగస్వామి సన్యాసి దగ్గిరికి వచ్చాడు.

అతడు తన తోటి వ్యాపారి రామస్వామి ఎలాంటి దుర్మార్గుడో సన్యాసికి చెప్పి, అతణ్ణి నష్టపరిచేందుకు ఏదైనా మంత్రం ఉపదేశించమన్నాడు.

''ఈ మంత్రాలున్నవే, ఉచ్చారణ సరిగా లేకపోతే బెడిసికొట్టే ప్రమాదం వున్నది. నేనే స్వయంగా ఒక యంత్రం తయారుచేసి యిస్తాను. రామస్వామి తప్పక నష్టపోతాడు. ఆ యంత్రానికి గాను నువ్వు వెయ్యి రూపాయలు ఇవ్వవలసి వుంటుంది,'' అన్నాడు సన్యాసి.

రంగస్వామి వెయ్యి రూపాయలు సన్యాసికిచ్చాడు. సన్యాసి అతణ్ణి యంత్రం కోసం మర్నాటి సూర్యోదయం వేళ రమ్మన్నాడు.

రామస్వామీ, రంగస్వామీ మర్నాటి సూర్యోదయంవేళ మర్రిచెట్టు దగ్గిర తారసపడి చాలా ఆశ్చర్యపోయారు. అక్కడ సన్యాసి లేడు. చెట్టు బోదెకు ఒక కాయితం వేళ్ళాడుతున్నది. అందులో యిలా రాసి వున్నది: నేను మరొక ప్రాంతం పోతున్నాను. ఒకరినొకరు నష్టపరుచుకోవాలన్న మీ యిద్దరి కోర్కెలూ నెరవేరినై గనక, యిక నేనిచ్చే యంత్రంతో అవసరం వుండదు.



# గిట్టని బేరం

వెంకటాపురంలో సుబ్బయ్య, కిష్టయ్య అనే యిద్దరు రైతులుండేవారు. ఎంతో సఖ్యంగా వుండే వాళ్ళిద్దరికీ, చేనుగట్టు దగ్గిర తగాదా వచ్చి, బద్ధశత్రుత్వం ఏర్పడింది. సుబ్బయ్య, ఏదో విధంగా కిష్టయ్యను చితకతన్నించాలనే నిర్ణయానికి వచ్చాడు.

గ్రామంలో రంగడు అనే ఒక పొగరుబోతు వున్నాడు. సుబ్బయ్య వాడి చేతిలో రెండు వందలు పెట్టి, కిష్టయ్యను దారికాచి చితకబాదమన్నాడు. రంగడు సరేనని వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం పొరుగూరు వెళ్ళి తిరిగి వస్తున్న సుబ్బయ్యను దారికాచి రంగడు కర్రతో నాలుగుబాదులు బాదాడు. సుబ్బయ్య బాధతో కేకలు పెడుతూ, "ఒరే, రంగా! ఇది పచ్చి అన్యాయం! కిష్టయ్యను కొట్టమని రెండు వందలు కూడా యిస్తినే; నన్ను కొడతావా?" అన్నాడు.

రంగడు వికవికమంటూ నవ్వి, "నీ బేరం నాకు గిట్టుబాటు కాలేదు. కిష్టయ్యగారు నాకు నాలుగువందలిచ్చారు. ఇవిగో, మీ రెండొందలూ తీసుకోండి," అంటూ డబ్బు సుబ్బయ్య చేతిలో పెట్టి వెళ్ళిపోయాడు.

—రాంబాబు





# తిట్లూ-శాపనార్థాలూ

ఒక గ్రామంలో ఒక వడ్డీవ్యాపారి ఉండేవాడు. వాడు పరమపాపిష్టివాడు. అందుచేత వాడికి దేవతలు కనిపించకపోయినా పిశాచాలు తప్పక కనిపిస్తూండేవి.

పిశాచాలను చూస్తే మంచివాళ్లు దడుచుకుంటారు, కాని, యిలాంటి పాపిష్టి వాళ్ళకు పిశాచాల భయం ఉండదు.

ఈ వడ్డీవ్యాపారి ఆ గ్రామంలో ఉన్న ఒక పేదరాలికి అప్పు ఇచ్చాడు. ఆ పేదరాలు ఆరుగురు పిల్లల తల్లి. అకస్మాత్తుగా భర్తపోయాడు. పిల్లలకు ఇంత గంజి కూడా కాచిపోయలేని స్థితిలో ఆవిడ రెండేళ్ళ క్రితం వడ్డీ వ్యాపారి దగ్గిర ముప్ఫై రూపాయలు అప్పుచేసి తన ఇల్లు తాకట్టు పెట్టింది. మరుసటి ఏడు ఆమె పాత బాకీ చెల్లు వేయలేకపోగా మరొక పదిహేను రూపాయలు అప్పు చేసింది. వడ్డీ వ్యాపారి ఆ బాకీలకు వడ్డీ కట్టి, వడ్డీకి మళ్ళీ వడ్డీలు కట్టి, అంతా కలిసి నూరు రూపాయలకు లెక్క తేల్చాడు. పేదరాలుండే ఇల్లు నూరు రూపాయల కన్న ఎక్కువ ఖరీదే ఉంటుంది. అయినా ఆ ఇల్లు ఖాళీ చేయించి స్వాధీనం చేసుకుందామని వడ్డీ వ్యాపారికి దుర్బుద్ధి పుట్టి ఒకనాటి ఉదయం వీధిలోకి అడుగు పెట్టాడు. సరిగా ఆ సమయానికే ఒక పిశాచం అతని ఇంటి ముందుగా పోతూ వడ్డీవ్యాపారికి కనబడింది.

"ఏమిటి గిరాకీ? ఇవాళ మా ఊళ్ళో ఎవరికన్నా మూడిందా ఏం?" అన్నాడు వడ్డీ వ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "మీ ఊరు వచ్చి చాలా కాలమయింది. ఏమన్నా ఆహారం దొరుకుతుందేమోనని బయలుదేరి వచ్చాను. నువు ఎంతదాకా?" అని అడిగింది.

25 ఏళ్ళనాటి చందమామ కథ

పేదరాలి ఇల్లు స్వాధీనం చేసుకోబో తున్నానని వడ్డీ వ్యాపారి, తాను పెట్టిన అప్పు గురించీ, దానిమీద పెరిగిన వడ్డీ గురించీ పిశాచానికి చెప్పాడు.

"అబ్బా, రెండేళ్ళు తిరగకుండానే అసలు కన్న వడ్డీ ఎక్కువయిందే! మీ మనుషులు మమ్మల్ని ఆడిపోసుకుంటారు గాని, మీలో మమ్మల్ని మించినవాళ్ళు న్నారు!" అన్నది పిశాచం.

వడ్డీ వ్యాపారి ఈ మాటలు విని ఆగ్రహించకపోగా, చాలా గర్వించాడు. ధనం పిండటంలో తానెంత సమర్థుడైనదీ ఆయనకు తెలుసు.

వాళ్ళు మాట్లాడుకుంటూ కొంత దూరం వెళ్ళేసరికి ఒక పూరిగుడిసెలోంచి ఎవరో స్త్రీ తన కొడుకు మీద కోప్పడటం వినిపించింది. "నిన్ను పిశాచం మింగా! తలుపు జాగ్రత్తగా మూయమని ఎన్నిసార్లు చెప్పినా నీకు జ్ఞాపకం ఉండదేం! మాయదారి పిల్లి కాస్తా వెన్నంతా మింగిపోయింది!" అంటున్నది.

"అదుగో, నీకు ఆహారం! ఆవిడ తన కొడుకును నీకు మింగబెడుతుందిట! త్వరగా వెళ్ళు," అన్నాడు వడ్డీవ్యాపారి పిశాచంతో.

పిశాచం నవ్వి, "అది మాటవరసకు అన్న మాటేగాని, మనస్ఫూర్తిగా ఆవిడ తన కొడుకును నా కిస్తాననటం లేదు. ఇంత అనుభవం వున్నవాణ్ణి నా కాపాటి తెలియదా?" అన్నది.



మరి కొంతదూరం వెళ్ళాక ఒకచోట భార్యాభర్తలు ఒకరినొకరు తిట్టుకుంటు న్నారు. ఒకరినొకరు, "నిన్ను పిశాచం మింగా!" అని తిట్టుకొనటం విని వడ్డీ వ్యాపారి పిశాచం కేసి తిరిగి, "ఇది ఇంకా మంచి అవకాశం! ఒక్క దెబ్బతో ఇద్దరిని మింగవచ్చు!" అన్నాడు నవ్వుతూ.

పిశాచం తల అడ్డంగా తిప్పి, "అవి తిట్లేగాని నిజమైన శాపనార్థాలు గావు. మనదారినమనం పోదాం పద!" అన్నది.

వాళ్ళు మరి కొంతదూరం నడిచి పేద రాలి ఇల్లు చేరుకున్నారు. వడ్డీవ్యాపారి ఇంటి తలుపు తట్టాడు. పేదరాలు వచ్చి తలుపుతీసి, వడ్డీవ్యాపారిని చూసి, "ఏం నాయనా!" అని పలకరించింది.

"మరేం లేదు, పిన్నీ. నీ బాకీ అసలు ఫాయిదాలు చేరి గొలుసు వడ్డీ లెక్కన నూరు రూపాయలయింది. ఈ ఇల్లేమో నాకు తాకట్టుపెడితివి. ఈ రెండేళ్ళలోనూ ఒక్క దమ్మిడీ చెల్లు వెయ్యకపోతివి. నువు మాత్రం ఎక్కణ్ణుంచి తెస్తావులే! ఇంటి ధరకూ బాకీకీ సరిపోతుంది. అందుచేత నువు ఇవాళే ఇల్లు ఖాళీచేసి నాకు స్వాధీనం చేసి బాకీ చెల్లు వేసుకో. ఈ మాట చెప్పిపోదామని వచ్చాను," అన్నాడు వడ్డీవ్యాపారి.

పేదరాలికి మండిపోయింది. "నీ కడుపుకాలా! నిన్ను పిశాచం మింగా! నలభైఅయిదు రూపాయిలు చేతిలో పెట్టి ఇల్లు కాజేస్తావట్రా? ఉండు నీ సంగతి చెబుతా," అంటూ లోపలికి వెళ్ళింది.

ఆవిడ వెనక్కు తిరిగిన మరుక్షణం పిశాచం వడ్డీవ్యాపారిని గుటుక్కున మింగి తన దారిన తాను వెళ్ళిపోయింది.

పేదరాలు వడ్డీవ్యాపారికి దేహశుద్ధి చెయ్యటానికని చీపురుకట్ట తీసుకు వచ్చే సరికి బయట ఎవరూ లేరు. వీధి వీధంతా నిర్మానుష్యంగా ఉంది.

"ఇంతలోనే ఏమైపోయాడబ్బా?" అనుకుంటూ పేదరాలు తలుపు వేసుకున్నది.





# ఓర్పులేనివాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు గుత్తిలుడు అనే వైణికుడుగా జన్మించాడు. పదహారు సంవత్సరాల వయసుకే గుత్తిలుడితో సమంగా వీణ వాయించే వాడు జంబూ ద్వీపంలో లేడన్న ఖ్యాతి దశదిశలా వ్యాపించింది. అందుచేత కాశీరాజు అతన్ని తన ఆస్థాన వైణిక విద్వాంసుడుగా పెట్టుకున్నాడు.

ఇది జరిగిన అనేక సంవత్సరాలకు కాశీ నుండి కొందరు వర్తకులు బయలుదేరి వ్యాపారం నిమిత్తం ఉజ్జయినీ నగరం వెళ్ళారు. గుత్తిలుడి ధర్మమా అంటూ కాశీరాజ్యంలో ఆబాలగోపాలానికీ వీణా వాద్యం మీద అత్యంత ప్రీతి. అందుచేత ఈ కాశీవర్తకులకు వీణావాద్యం మీద మనసు పోయింది. వారు అక్కడి వర్తకులతో, ''మాకు వీణావాద్యం వినాలని ఉన్నది. ఈ ఉజ్జయినిలో ఉండే వైణికులలో కెల్లా గొప్పవాణ్ణి పిలిపించి, వాద్యగోష్ఠి ఏర్పాటు చేయండి. ఎంత ఖర్చయినా సరే మేము ఉమ్మడిగా భరిస్తాం!'' అన్నారు.

ఉజ్జయినిలో గొప్ప వైణికుడు మూసిలుడు అనేవాడు. అందుచేత కాశీవర్తకుల వినోదం కొరకు అతని పాటకచేరీ ఏర్పాటు చేశారు. మూసిలుడు వీణతో సహా వర్తకుల బసకు వచ్చాడు. వీణతీగెలు శ్రుతి చేసి వాయించసాగాడు. ఎంతసేపు వాయించినా కాశీవర్తకుల ముఖాలలో ఆనందం ఏమీ కనబడలేదు. ఇలా కాదని మధ్యమం శ్రుతి చేసి కొన్ని పాటలు వాయించాడు. అప్పటికీ వర్తకులలో చైతన్యం కనిపించలేదు.

చివరకు మూసిలుడు, ''అయ్యా, నేనింతసేపుగా వీణ వాయిస్తున్నాను గాని



తమకు కొంచెమైనా ఆనందం కలిగినట్టు కనబడదు. నా వీణావాద్యం తమకు నచ్చలేదా ?'' అని అడిగాడు.

కాశీవర్తకులు తెల్లబోయి ఒకరినొకరు చూసుకున్నారు. వారిలో ఒకడు, ''నువ్విందాకనుంచీ వీణ వాయిస్తున్నావా ? శ్రుతులు సరిచూస్తున్నావనుకుంటున్నాం!'' అన్నాడు.

''వీణ చెడిపోయింది కాబోలు, సరిగా పలకక నిన్ను తిప్పలు పెడుతున్నదనుకుంటున్నాం! క్షమించాలి, అంతకన్న మరేం లేదు!'' అన్నాడు ఇంకొకడు.

మూసిలుడు ముఖం ముడుచుకుని, ''అయితే మీరు నాకన్న చాలా గొప్ప వైణికుడి వాద్యం విని వుంటారు. అందుచేతనే నా వాద్యం మీకు నచ్చలేదు. ఆ వాద్యగాడెవరో సెలవియ్యండి,'' అన్నాడు.

''అయితే నువు మా కాశీనగర ఆస్థాన వైణికుడైన గుత్తిలుడి వాద్యం గురించి విననే లేదా ?'' అని వర్తకులు అడిగారు.

''ఆయన గొప్ప వాద్యగాడా ?'' అని అడిగాడు మూసిలుడు.

''ఆయన వీణావాద్యంతో పోలిస్తే నీది వాద్యమే కాదు,'' అన్నారు వర్తకులు.

''అయితే ఆయనతో సమంగా వాయించాననిపించుకునేదాకా నేను విశ్రాంతి పుచ్చుకోను. నాకు మిరేమీ డబ్బివ్వనవసరంలేదు,'' అంటూ మూసిలుడు వెళ్ళిపోయాడు. అతను ఆ రోజే ప్రయాణమై కాశీనగరం చేరి బోధిసత్వుడి ఇంటికి వెళ్ళాడు.

బోధిసత్వుడు మూసిలుడిని చూసి, ''ఎవరు నాయనా ?'' అని అడిగాడు.

''అయ్యా, మాది ఉజ్జయిని. నన్ను మూసిలుడంటారు. తమ వద్ద వీణనేర్చుకోవాలని వచ్చాను. తమ అనుగ్రహం వుంటే తమతో సమానుణ్ణి అనిపించుకోవాలని నా ఉద్దేశం!'' అన్నాడు మూసిలుడు.

బోధిసత్వుడు అతనికి వీణావాద్యం నేర్పటానికి అంగీకరించాడు.

మూసిలుడు రోజూ ఇంటి వద్ద వీణ అభ్యసిస్తూ రాజసభకు బోధిసత్వుడి వెంట వెళ్ళుతూండేవాడు.

అనేక సంవత్సరాలు గడిచాయి. ఒక నాడు బోధిసత్వుడు తన శిష్యుడితో, నీ విద్య పూర్తి అయిపోయింది. నాకు తెలిసినదంతా నీకు నేర్పేశాను. ఇక నువు మీ దేశం వెళ్ళిపోవచ్చు.'' అన్నాడు.

కాని మూసిలుడికి ఉజ్జయినికి తిరిగి పోవాలని లేదు. అక్కడ తన విద్య రాణించదు. తనకు వీణ వాయించటం ఏమీ రానప్పుడే ఉజ్జయినీవారు తనకు బ్రహ్మరథం పట్టారు. ఎలాగైనా కాశీ అస్థాన విద్వాంసుడైతేనే కీర్తి, ప్రతిష్ఠా! ఇప్పుడు తనకు బోధిసత్వుడితో సమాన మైన విద్వత్తున్నది. బోధిసత్వుడు వృద్ధుడై పోతున్నాడు కూడానూ! అందుచేత కాశీ రాజు ఆస్థానంలోనే ఉద్యోగం సంపాదించాలి.

ఇలా ఆలోచించి మూసిలుడు, బోధిసత్వుడితో, ''నాకు ఉజ్జయిని వెళ్ళాలని లేదు. మీ పాండిత్యమంతా నాకు కూడా వచ్చిందంటున్నారు గనక, మీతోబాటు నాకు కూడా ఆస్థానంలో ఉద్యోగం అయే లాగు చూడండి!'' అన్నాడు.

మరునాడు బోధిసత్వుడు ఈ విషయం రాజుతో చెప్పాడు.



''అతను నీ వద్ద చాలాకాలంగా శిష్యుడుగా ఉన్నాడు గనక ఆస్థాన విద్వాంసుడుగా వేసుకుందాం. నీ కిచ్చే జీతంలో సగం ఇస్తాను. అతనికి సమ్మతమైతే పదవి స్వీకరించవచ్చు.'' అన్నాడు రాజు.

బోధిసత్వు డీ మాట చెప్పగానే మూసిలుడు సంతోషించటానికి బదులు లోలోపల కుళ్ళాడు. తన తక్కువేమిటి? బోధిసత్వుడి ఎక్కువేమిటి? ఆయన జీతంలో తనకు సగం ఇవ్వటమేం?

మూసిలుడు, రాజు వద్దకు వెళ్ళి, ''మహాప్రభూ, నన్ను సగం జీతం మీద ఆస్థాన విద్వాంసుడుగా నియమిస్తామన్నారుట! నా తక్కువేమిటి?

మా గురువుగారి కెంత వచ్చునో, నాకూ అంత వచ్చు. కావలిస్తే మా గురువుగారినే అడగండి. ఆయన కిచ్చినంత జీతమూ తమరు నాకు కూడా దయచేయించాలి!'' అన్నాడు.

రాజుకు కోపం వచ్చింది. ''నువు గుత్తిలుడి శిష్యుడివని నే నెరుగుదును గాని, ఆయనతో సమానమైన వైణికుడివని నే నెరగను. ప్రత్యక్షంగా చూస్తే తప్ప నమ్మను కూడాను,'' అన్నాడాయన.

''కావలిస్తే తమరు నన్ను పరీక్షచేసి చూడండి,'' అన్నాడు మూసిలుడు.

''సరే, మీ ఇద్దరికీ వాద్యపోటీ ఏర్పాటు చేస్తాను. నీ వాద్యం మీ గురువు వాద్యంతో సమంగా ఉంటె నీకు కూడా ఆయనతో సమానంగా జీతం ఇస్తాను. లేకపోతే నిన్ను ఆస్థానంలోకి రానిచ్చేదే లేదు. సమ్మతమేనా?'' అని అడిగాడు రాజు. మూసిలుడు అంగీకరించాడు.

గురు శిష్యు లిద్దరికీ పోటీ ఏర్పాటయింది. ఒకరిని మించి ఒకరు వాయించటానికి ప్రయత్నిస్తున్నారు. మధ్యలో బోధిసత్త్వుడి వీణాతంత్రి ఒకటి తెగింది. కాని ఆయన జరిగిన దానిని ఏమాత్రం పట్టించుకోక మిగిలిన తీగల మీదనే వాయిస్తున్నాడు. ఇది చూసి మూసిలుడు తన వీణ తంత్రి ఒకటి బుద్ధిపూర్వకంగా తెంపేశాడు. మరికాస్సేపటికి బోధిసత్త్వుడి వీణా తంత్రులలో మరొకటి తెగింది. మూసిలుడు కూడా మరొక తంత్రి తెంపేశాడు. కొద్దిసేపట్లోనే బోధిసత్త్వుడి వీణతంత్రు లన్నీ తెగిపోయాయి; మూసిలుడు తన వీణ తంత్రులన్నీ తెంపేసుకున్నాడు. అయితే బోధిసత్త్వుడు తెగిపోయిన తంత్రులతోనే స్వరాలు పలికించసాగాడు. కాని మూసిలుడు ఆ పని చెయ్యలేక బిక్క మొహం వేశాడు.

సభవారు బోధిసత్త్వుడి ప్రతిభకు హర్షించి మూసిలుణ్ణి గేలిచేశారు.

మూసిలుడు ఆ అవమానాన్ని భరించలేక సభలో నుంచి బయటికి వెళ్ళి, ఆ రోజే ఉజ్జయినీ నగరానికి ప్రయాణమయ్యాడు.



# సుల్తానా రజియా

టర్కీ దేశంలోని ఒక కొండ లోయలో, కొందరు యువకులు ఆటలాడుతున్నారు. వాళ్ళల్లో ఒకడు మిగతావారికన్న వయసులో చాలా చిన్న. ఆ సమయంలో వర్తకుల బిడారొకటి ఆ ప్రదేశానికి వచ్చింది. మిగతా యువకులు చిన్నవాణ్ణి పట్టుకుని, బిడారు వర్తకులలో ఒకడికి, అతణ్ణి బానిసగా అమ్మివేశారు.

కొంతకాలం గడిచాక ఆ బానిస బాలుణ్ణి చూసి జాలిపడినవాడొకడు అతణ్ణి కొన్నాడు. ఈ కొన్నవాడు ఘోరీ మహమ్మద్ ప్రధాన బానిస. ఘోరీ మరణానంతరం అతడు ఢిల్లీ పాలకుడయ్యాడు. కుతుబుద్దీన్ ఐబక్‌గా అతడు చరిత్ర ప్రసిద్ధుడు.






ఇలా రెండుసార్లు బానిసగా అమ్ముడుపోయిన బాలుడి పేరు ఇల్టమష్. అతణ్ణి బానిసవాడి బానిస అనేవాళ్ళు. ఒకసారి అతడు తన యజమానిని హత్యా ప్రయత్నం నుంచి రక్షించాడు. ఈ కారణంగా ఇల్టమష్ అంటే ఐబక్‌కు చాలా వాత్సల్యం కలిగింది. కొన్నేళ్ళ తర్వాత ఇల్టమష్ ఐబక్ కుమార్తెను వివాహం ఆడాడు.



ఐబక్ మరణానంతరం రాజ్యం అరాజకం పాలయింది. ఇల్టమష్ సింహాసనం ఆక్రమించుకుని తనకు ఎదురుతిరిగిన గజ్నీ పాలకుడైన తాజుద్దీన్‌తోపాటు, మరికొందరు అమీర్లను కూడా ఓడించాడు. ఈ విధంగా అతడు తిరుగుబాటుదార్లను అణచి, తన అధికారాన్ని సుస్థిరం చేసుకున్నాడు.

క్రీ. శ. 1232 ప్రాంతాల ఇల్టమష్ ఢిల్లీలోని కుతుబ్ మీనార్ నిర్మాణం పూర్తి చేశాడు. ఇది చూపరులను అద్భుతపరిచే గోపురం లాంటి ఎత్తయిన కట్టడం. ముస్లిం మతగురువైన ఖ్వాజా కుతుబుద్దీన్ సమాధి మీద దీని నిర్మాణం జరిగిందని చెపుతారు.





తన మరణ సమయంలో ఇల్టమష్ ఎవరూ ఊహించని విధంగా, తన కుమారులకు బదులు, కుమార్తె రజియాను తన తదనంతరం పరిపాలకురాలుగా ప్రకటించాడు. అతడి కుమారులు పనికిమాలినవాళ్ళు. రజియా క్రమశిక్షణ కలది; వివేకవంతురాలు.

ఇల్టుమష్ నిర్ణయం ఆనాటి సామాజిక పరిస్థితులకు అనుగుణ్యమైనది కాదు. అమీర్లూ, యితర ముఖ్యులూ స్త్రీని పరిపాలకురాలుగా అంగీకరించే స్థితిలో లేరు. తండ్రి మరణించగానే వాళ్ళు రజియాను పదవీచ్యుతురాల్ని చేశారు.





వాళ్ళ దృష్టి రజియా సవతి తమ్ముడైన రుక్ ఉద్దీన్ మీద పడింది. అతణ్ణి ఢిల్లీ సుల్తానుగా గద్దె ఎక్కించారు. ఇతడు అవివేకి, వదరుబోతు. తాను సుల్తాను అయ్యానన్న ఉత్సాహంతో ఏనుగు నెక్కి ఢిల్లీ వీధులలో ఊరేగుతూ, ప్రజల మీద గుప్పెళ్ళతో వెండి, బంగారు నాణాలను వెదజల్లాడు.

రుక్ ఉద్దీన్ తల్లి అయిన షాతుర్కాన్ ఇల్టుమష్ భార్యల్లో ఒకతె. ఆమె చాలా క్రూరురాలు. కొడుకు ఆటపాటల్లో మునిగితేలుతూంటే, ఆమె అధికారాన్నంతా తన హస్తగతం చేసుకుని ఇల్టుమష్ భార్యల్లో కొందరిని చంపించి, మిగతావారిని ఖైదులో పెట్టించింది.





రాజవంశంలో సమర్థుడూ తెలివిగల వాడూ అయిన ఒకేఒక సవతికొడుకును షాతుర్కాన్ ముందు కళ్ళుపొడిపించి, తరవాత హత్యచేయించింది. రజియాను చంపించాలని పథకం వేసింది. ఈ సంగతి తెలిసి కూడా రజియాకు ఏం చేసేందుకూ పాలుపోలేదు.

షాతుర్కాన్, రుక్ఉద్దీన్‌ల దుశ్చర్యలు ప్రజలలో పెద్ద అలజడి రేకెత్తించినై. వాళ్ళను బలపరిచే సర్దారులు కూడా ప్రజల ఆగ్రహానికి వెరచి పక్కకు తప్పుకున్నారు. షాతుర్కాన్ ఖైదు చేయబడింది. ఆమె కొడుకు ముందు సింహాసనం కోల్పోయి, తరవాత హత్యకు గురయ్యాడు.





ఈ అరాజక పరిస్థితుల్లో ఒక్క రజియా తప్ప, ప్రజలను సంతృప్తిపరచగల వాళ్ళు మరెవ్వరూ లేరు. ప్రజలకు ఆమె తండ్రి వీలునామా ఏమిటో తెలుసు. వాళ్ళామెను సింహాసనం అధిష్ఠించవలసిందిగా కోరారు. ఈ పరిస్థితుల్లో అమీర్లూ, ఇతర ముఖ్యులూ ఆమెను బలపరచక తప్పలేదు. ఈ విధంగా రజియా సుల్తానా రజియాగా ఢిల్లీ పాలకురాలైంది.



# కార్యసాధకుడు

తామ్రపర్ణి అనే రేవుపట్టణంలో, రామగుప్తుడనే వ్యాపారి వుండేవాడు. అతడు న్యాయం, ధర్మం తప్పకుండా ఎంతో మెలకువగా వర్తక వ్యాపారాలు చేసి చాలా ధనం గడించాడు. కొడుకులు మురహరి, నరహరి అనే వాళ్ళు పెద్దవాళ్ళయాక, రామగుప్తుడికి సముద్ర వర్తకం ప్రారంభించాలన్న కోరిక కలిగింది. సాటివర్తకులు కొందరు తూర్పు దీవులకు ఓడలలో సరుకులు తీసుకుపోయి, మంచి లాభాలతో తిరిగి రావడం అతడు చూశాడు.

ఓడల మీద సముద్రప్రయాణం చాలా శ్రమతో కూడిన పని. అందువల్ల, రామగుప్తుడు తన కొడుకుల్లో ఒకరికి ఆ పని ఒప్ప చెబుదామనుకున్నాడు. కాని, కొడుకులిద్దరూ కొత్త ప్రదేశాలు చూడవచ్చన్న ఉత్సాహంతో, నేనంటే నేనని పట్టుబట్టారు. రామగుప్తుడు ఈ సమస్యను ఎలా పరిష్కరించాలన్న ఆలోచనలో పడ్డాడు.

కొద్దిరోజుల తరవాత రామగుప్తుడు కొడుకులిద్దరినీ పిలిచి, "ఓడ ప్రయాణానికి యింకా చాలా వ్యవధి వున్నది. అడవి మార్గంలో వున్న దేవాలయానికి దాపుల్లో సత్రం ఒకటి కట్టించదలిచానని లోగడ చెప్పా గదా. ఆ సత్రం పని మీలో ఎవరు చాకచక్యంగా నిర్వహిస్తే, వాళ్ళను ఓడలో పంపుతాను. ఇది మీకు యిష్టమేనా ?" అన్నాడు.

తరవాత చీట్లు వేయగా, ఆ పని బాధ్యత మురహరి వంతు వచ్చింది. మురహరి సత్రం కట్టించే ప్రదేశానికి వెళ్ళాడు. త్వరలోనే రాళ్ళూ, సున్నం వగైరాతో పాటు మేస్త్రీలు కూడా వచ్చారు. అక్కడ వున్న చెట్టూ చేమా కొట్టడానికీ,

చెల్లూరి సీతారాజేశ్వరరావు



రాళ్ళు మోయడానికి, ఏటి నుంచి నీరు తెచ్చేందుకూ కూలీల అవసరం కలిగింది. పట్నం నుంచి వాళ్ళను తీసుకురావడం చాలా ఖర్చుతోకూడినపని గనక, సమీపంలో వున్న కోయగూడెంలో కూలీల కోసం మురహరి ప్రయత్నించాడు. కాని, వాళ్ళు రామన్నారు.

ఇప్పుడేం చేయడమా అని ఆలోచిస్తూ, మురహరి సత్రం కట్టే ప్రదేశాన వున్న తన గుడారానికి తిరిగి వచ్చేసరికి, కుశాలుడనే కోయవాడొకడు అక్కడికి వచ్చి, ''అయ్యా, తమకు కూలిమనుషులు కావాలా? నేను కోయగూడెం నుంచి తేగలను,'' అన్నాడు.

మురహరి కొంచెం ఆశ్చర్యపోయి, ''సరే, వందమంది కూలీలను తేగలవా?'' అని అడిగాడు.

కుశాలుడు తేగలనని చెప్పి, తనకు నెలకు వంద వరహాల జీతం కావాలన్నాడు. మురహరి అందుకు ఒప్పుకున్నాడు. కుశాలుడు ఆ మర్నాడే కోయగూడెం నుంచి కూలివాళ్ళను పిలుచుకు వచ్చాడు. సత్రం కట్టే పని చురుకుగా సాగిపోతున్నది.

ఒకనాడు రామగుప్తుడు సత్రం పని ఎంతవరకు పూర్తయిందో చూద్దామని వచ్చాడు. ఆ సమయంలో కుశాలుడు ఒక చెట్టు నీడన నిలబడి ఎవరితోనో కబుర్లాడుతున్నాడు. రామగుప్తుడు కొడుకు ద్వారా, కుశాలుడికి ముట్టుతున్న జీతం సంగతి తెలుసుకుని, ''నీడపట్టున కబుర్లతో కాలక్షేపం చేసేవాడికి అంత జీతం ఎందుకు? నెలకు పది వరహాలు యివ్వు, సరిపోతుంది,'' అన్నాడు.

ఆ సాయంత్రం తండ్రి వెళ్ళిపోగానే మురహరి కుశాలుణ్ణి పిలిచి, ''ఇది, మా నాన్నగారి అజ్ఞ! ఇక నుంచి నీకు నెల జీతం పది వరహాలు,'' అని చెప్పాడు.

మర్నాడు పనివాళ్ళెవరూ రాలేదు. మురహరి స్వయంగా కోయగూడేనికి

పోయి అడిగినా, వాళ్ళు పనిలోకి రామని నిర్మొహమాటంగా చెప్పేశారు. సత్రం కట్టే మేస్త్రీలు వచ్చేది వర్షాకాలమనీ, సత్రం పని యీలోగా ముగించకపోతే, చాలా నష్టపడవలసి వస్తుందనీ, మురహరికి చెప్పారు. చేసేదిలేక మురహరి మరొక సారి గూడేనికిపోయి, కుశాలుడికి పాత లెక్కనే జీతం యిస్తానని చెప్పాడు. ఆ మర్నాడు కూలీలందరూ పనిలోకి వచ్చారు.

రెండు వారాల తరవాత రామగుప్తుడు మరొకసారి సత్రం పని చూడడానికి వచ్చాడు. మురహరి తండ్రికి జరిగిన సంగతి చెప్పాడు. రామగుప్తుడు చిరాకు పడుతూ, "ఇలా అయితే, ఖర్చు రెట్టింపవుతుంది. ఇక, నీ ప్రయోజకత్వం ఏమిటి?" అని వెళ్ళిపోయాడు.

మురహరి మరొకసారి కుశాలుణ్ణి పిలిచి, జీతం పది వరహాలకు మించి యిచ్చేది లేదని చెప్పాడు. ఆ మర్నాటి నుంచీ కూలీలు రావడం మానారు. మేస్త్రీలు తిరిగి గొడవ ప్రారంభించారు. మురహరి పని అడకత్తెరలో చిక్కినట్టయింది. అతడు ఇంటికిపోయి, తండ్రితో సత్రం కట్టించే పని తనవల్ల కాదని చెప్పేశాడు. రామగుప్తుడు చిన్న కొడుకు నరహరిని పంపాడు.

నరహరి వస్తూనే కుశాలుణ్ణి పిలిచి, "నీకు నెలకు పది వరహాలకన్న జీతం యివ్వను, అది మా నాన్నగారి ఆజ్ఞ!



ఇకపోతే, పనివాళ్ళందరి మీదా పెద్దగా వ్యవహరిస్తున్నావు గనక, రోజుకు మూడు వరహాల భత్యం అదనంగా యిస్తాను. ఇష్టమైతే మీవాళ్ళందర్నీ పనికి రమ్మను, లేకపోతే పట్టణం నుంచి రేపీపాటికి మనుషుల్ని పిలుచుకువస్తాను," అన్నాడు.

కుశాలుడు ఒకటి, రెండు క్షణాలు మనసులోనే లెక్కవేసి చూసుకుని, చిన్నగా నవ్వి, "అలాగే కానివ్వండి, అంతా తమ దయ!" అన్నాడు.

సత్రం కట్టే పని పూర్తి అవుతున్న తరుణంలో రామగుప్తుడు మరొకసారి వచ్చి కుశాలుడికి తన చిన్న కొడుకు నెలకు పది వరహాల జీతం మాత్రమే యిస్తున్నట్టు తెలుసుకుని, "మీ అన్న సాధించలేనిది, నువ్వు సాధించావు! ఎలా సాధించావని నేనడగ దలచలేదు. అదంత ముఖ్యం కాదు. భాష కూడా తెలియని పరాయిదేశాలకుపోయి, వర్తకంలో నెగ్గుకు రావడం మాటలుకాదు గదా! నువ్వు కార్యసాధకుడివి! నిన్నే ఓడవర్తకానికి పంపదలిచాను," అన్నాడు.

ఈ సంగతి విన్న మురహరి ఆశ్చర్య పోతూ తమ్ముడి దగ్గిరకు వచ్చి, కుశాలుణ్ణి పది వరహాల నెల జీతానికి ఎలా ఒప్పించ గలిగావని అడిగాడు.

"కర్ర విరగకుండా, పాము చావ కుండా పని జరపవలసిన సందర్భాలు కొన్ని వస్తుంటవి. కుశాలుడికి నెలకు పది వరహాల జీతం యిస్తూ, రోజుకు మూడు వరహాల భత్యం ఏర్పాటు చేశాను. ఆ మూడు వరహాలూ నాన్నగారు నా ఖర్చులకని యిచ్చిన డబ్బులోంచి చెల్లించాను. సమస్య సునాయాసంగా పరిష్కారమైపోయింది," అన్నాడు నరహరి.

"ఇంత చిన్న ఉపాయం కూడా నాకు తోచలేదు; ఇంక నేను సముద్రవర్తకం చేసేదేమిటి? ఆ పనికి నువ్వే తగుదువు," అంటూ మురహరి తమ్ముణ్ణి మెచ్చుకున్నాడు.



# జ్ఞానోదయం

వెంకటప్పకు, మేనమామ కూతురు తాయారుతో పెళ్ళి నిశ్చయమయింది. తల్లిదండ్రుల బలవంతం మీదనే, అతడీ పెళ్ళికి ఒప్పుకున్నాడు. అయినా, అతడి బంధువులూ, స్నేహితులూ మాత్రం, "తాయారు అనాకారి; పైగా గయ్యాళి, రణపెంకి. అలాంటిదాన్ని వెంకటప్ప చేసుకోబోతున్నాడంటే, మేనమామ ఆస్తికోసం తప్ప మరేంకాదు!" అని చాటుగా అనసాగారు.

అనలే తాయారును పెళ్ళాడ యిష్టం లేని వెంకటప్పకు, యీ మాటలు చాలా బాధ, కలిగించినై. అతడు ఒక రాత్రివేళ ఇల్లు వదిలి, అక్కడికి పదామడలదూరంలో వున్న సదానందస్వామి ఆశ్రమానికి వెళ్ళి, ఆయన సన్యాసిశిష్యగణంలో కలిసిపోయాడు.

ఆరునెలలు తిరక్కుండానే వెంకటప్ప ఆశ్రమనియమాలకూ, కట్టుబాట్లకూ తట్టుకోలేక బేజారెత్తి, ఇంటికి తిరిగివస్తూనే, తనకు తాయారుతో పెళ్ళి యిష్టమేనని తల్లిదండ్రులకు చెప్పాడు. వారం తిరక్కుండానే పెళ్ళి జరిగిపోయింది.

వెంకటప్ప స్నేహితులు అతడితో నవ్వులాటగా, "సంసారం చెయ్యలేక విసుగెత్తి సన్యాసుల్లో కలిసినవాళ్ళున్నారు కాని, నీలాగా అందుకు భిన్నంగా ప్రవర్తించిన వాళ్ళను మేం ఎరగం!" అన్నారు.

దానికి వెంకటప్ప నవ్వి, "ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. ఆరు నెలలపాటు సన్యాసుల మధ్య కాలం గడిపాకే, నాకు తాయారుతో కాపరం స్వర్గప్రాయంగా వుంటుందన్న నమ్మకం కలిగింది!" అన్నాడు.

—జొన్నలగడ్డ రత్న





# ప్రాణదాతలు

మధ్యాహ్నమనగా ఇంటి నుంచి బయలు దేరిన సాగరుడు, తోటపల్లె అనే గ్రామం పొలిమేరలు చేరేసరికి, అర్ధరాత్రి కావచ్చింది. ఆ సమయంలో విపరీతంగా చలిగాలివీస్తున్నది. గ్రామం నిర్మానుష్యంగా వున్నది. ఆ రాత్రికి తల దాచుకునేందుకు ఎక్కడ ఆశ్రయం దొరుకుతుందా అని, వీధి వెంట నడుస్తున్న అతడికి, ఒక పెంకుటింట్లో దీపం వెలుగు కనిపించింది.

సాగరుడు ఆ ఇంటి కేసి వెళ్ళాడు. గుమ్మంలో ఒక అమ్మాయి నిలబడి వుండడం చూసి అతడికి ఆశ్చర్యం కలిగింది. ఇదీ తన మంచికే అనుకుంటూ అతడు ఆమెను సమీపించి, "బాటసారిని. ఈ రాత్రికి మీ ఇంటి వసారాలో తలదాచుకోనిస్తారా ?" అని అడిగాడు.

ఆ అమ్మాయి వెంటనే జవాబు చెప్పక, సాగరుడి కేసి పరీక్షగా చూసింది. ఆమె ఎందుకో ఆందోళనపడుతున్నట్టు సాగరుడు గమనించాడు.

"మీరు, నా కొక చిన్న సహాయం చెయ్యగలరా ?" అన్నదామె.

ఆ ప్రశ్నకు సాగరుడు ఆశ్చర్యపడుతున్నంతలో ఆమె, "అడవికి పొద్దుననగా వెళ్ళిన మా నాన్న, యింతవరకూ తిరిగిరాలేదు. నాకు భయంగా వున్నది. ఆయన్ని వెతకడానికి తోడుగా అడవిలోకి రాగలరా ?" అన్నది, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

సాగరుడికి ఆమెపై జాలికలిగింది. అతడు చాలా దూరం నడవడం వల్ల బాగా అలసివున్నాడు. అయినా, ఏమాత్రం సంకోచించకుండా, "తప్పకుండా వస్తాను, పదండి !" అన్నాడు.

ఆమె చప్పున ఇంటికి తాళంపెట్టి, లాంతరు తీసుకుని బయలుదేరింది.

మాచిరాజు కామేశ్వరరావు



దారిలో ఆమె సాగరుడికి తనను గురించి చెప్పుకున్నది.

ఆమె పేరు కళ్యాణి. తండ్రి తప్ప మరెవరూ లేరు. తండ్రి లోగడ అడవి నుంచి కట్టెలు కొట్టి తెచ్చేవాడు. కాని, వయసు మీరడంతో ఓపిక తగ్గి, యీ మధ్య కొంతకాలంగా అడవి నుంచి కుంకుళ్ళూ, చింతపండూ ఏరి తెచ్చి సంతలో అమ్మడం ప్రారంభించాడు. మామూలుగా పొద్దున్నే అడవికి పోయి, సాయంకాలానికల్లా తిరిగి వస్తాడు. ఇవాళ అర్ధరాత్రి అయినా తిరిగి రాకపోయేసరికి, ఆమె ఆందోళనపడుతున్నది.

"మాటా, చేతా ఆదుకునే ఇరుగు పొరుగు, ఎవరో అదృష్టవంతులకు గాని దొరకరు! ఎంత బతిమాలినా ఏ ఒక్కరూ, యీ చలిలో నా వెంట అడవికి రావడానికి ఒప్పుకోలేదు," అన్నది కళ్యాణి.

ఆమె పూర్వం నాలుగైదుసార్లు తండ్రి వెంట అడవికి వెళ్ళివున్నది. అతడు ఏ ప్రాంతాల్లో తిరుగుతాడో ఆమెకు తెలుసు. అక్కడికి చేరగానే పెద్దగా గొంతెత్తి, "నాన్నా! నాన్నా!" అంటూ కేకలువేసింది.

కళ్యాణి తండ్రి పేరు బసవన్న అని తెలుసుకుని సాగరుడు కూడా చాలాసార్లు గట్టిగా కేకలుపెట్టాడు. ఆ కేకలకు చెట్ల మీది పక్షులు కోలాహలంగా అరిచాయి తప్ప, బసవన్న నుంచి మాత్రం జవాబు రాలేదు. ఇద్దరూ కేకలుపెడుతూ అడవిలో చాలా దూరం తిరిగి, తెల్లవారవస్తుండగా నిరాశతో ఇల్లు చేరారు.

కళ్యాణి దుఃఖం ఆపుకోలేక ఏడవడం ప్రారంభించింది. సాగరుడు ఆమెకు ధైర్యం చెబుతూ, "మీ నాన్న, హఠాత్తుగా ఏదైనా పనితగిలి, అటునుంచి అటు మరేదైనా ఊరు వెళ్ళివుండవచ్చు. సాయంత్రం వరకూ చూద్దాం," అన్నాడు.

సాయంత్రం కావస్తూండగా, వీధిలో నుంచి ఒక ఏభై ఏళ్ళ వయసువాడు కళ్యాణిని కేకవేసి పిలిచాడు. వాడు అడవిలో కట్టెలు కొట్టుకు బతికే సోమన్న.



సోమన్న కుంకుళ్ళతో సగం నిండిన సంచీ నొకదాన్ని కళ్యాణికిస్తూ, ''ఇది అడవిలో దొరికింది. కొంచెం దూరాన, యీ చెప్పులు దొరికాయి. ఇవి, మీ నాన్నవే గదా ? నాకు యింకా కాస్త ఆశ వుందనుకో—అయినా, లోగడ అదే ప్రదేశాన సత్తెన్నను పులి ఎత్తుకుపోయిన సంగతి మనకు తెలుసు,'' అని తల వంచుకు వెళ్లిపోయాడు.

ఆ మాటలు వింటూనే కళ్యాణి స్పృహ తప్పి పడిపోయింది. సాగరుడు ఆమె ముఖాన నీళ్లు చల్లి, ఉపచారాలు చేస్తూ కూర్చున్నాడు. ఒక రాత్రివేళ అతడు మగతనిద్రలో వున్న సమయంలో పెరట్లో ఏదో అలికిడి అయి, మెలకువ వచ్చింది. మంచం మీద కళ్యాణి లేదు. సాగరుడు గబగబా పెరట్లోకి వెళ్ళాడు. కళ్యాణి జుట్టు పీక్కుంటూ బావికేసి నడుస్తున్నది.

సాగరుడు ఆమె చేయి పట్టుకుని, ''ఇదేం పని? ఇంట్లోకి పద,'' అంటూ గట్టిగా కోప్పడ్డాడు.

''నేను బతికుండి ఏం లాభం? ఈ లోకంలో నాకు దిక్కంటూ లేదు,'' అంటూ కళ్యాణి పెద్దగా రోదించింది.

సాగరుడు ఆమెను ఓదార్చుతూ, ''నీకు, నేనున్నాను! నా తల్లిదండ్రులను ఒప్పించి, నిన్ను పెళ్ళాడతాను, సరా!'' అన్నాడు.

కళ్యాణి యింట్లోకి వచ్చి, ఎప్పటిలా మంచం మీద పడుకున్నది. తెల్లవారుతున్న సమయంలో ఒక ఒంటెద్దు బండి వచ్చి, యింటి ముందు ఆగింది. కళ్యాణి వెళ్ళి వీధి తలుపు తెరుస్తూనే, బండిలో నుంచి దిగుతున్న తండ్రిని చూసి, ఆనందం పట్టలేక చిన్నగా కేక పెట్టింది. నీరసంగా వున్న బసవన్నకు ఒక యువకుడు చేతి సాయం యిచ్చి నడిపిస్తూ, యింట్లోకి తీసుకు వచ్చాడు.

పైపంచెతో కూతురు కళ్ళనీళ్ళు తుడుస్తూ, బసవన్న జరిగిందేమిటో చెప్పాడు :

బసవన్న అడవిలో రాలిన కుంకుళ్ళు ఏరుతూ, ఒకచోట కొమ్మల్లో బాగా పండిన కుంకుళ్ళను చూశాడు. చెట్టెక్కి వాటి నన్నిటినీ సునాయాసంగా రాల్చవచ్చు ననుకుంటూ, అతడు చెట్టు బోదెను సమీపిస్తూ, అజాగ్రత్త కొద్దీ అక్కడ వున్న పుట్ట మీద కాలు వేశాడు. ఆ మరుక్షణం తాచుపాము బుస్సుమంటూ బయిటికి వచ్చి, అతడి కాలిమీద కాటువేసి జర జరమంటూ పారిపోయింది.

పామును స్పష్టంగా చూసిన బసవన్న కళ్ళు బైర్లుకమ్మి, అక్కడే కుప్పలా కూలిపోయాడు.

''ఆ తరవాత జరిగిందేమిటో యీాయన ఎరగడు, నేను చెబుతాను!'' అంటూ బసవన్న వెంట వచ్చిన యువకుడు ప్రారంభించాడు :

''నా పేరు రాజారాం. బాల్యంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న అనాథను. ఊళ్లో ఎవరూ నన్ను ఆదరంగా చూసే వాళ్లు కాదు. వాళ్లకు నేనంటే చిన్న చూపు. మొన్న మా ఊళ్ళో గ్రామదేవత జాతర. పశువుల బలులూ, భక్తుల పెడ బొబ్బలూ చూడలేక నేను అడవిలోకి వెళ్లాను. అక్కడ మీ నాన్న ఒక చెట్టు కింద నురగలు కక్కుతూ కనిపించాడు. అది పాము కాటని నేను గ్రహించి, ఈయన్ని భుజాన వేసుకుని పక్క ఊరిలో వున్న వైద్యుడి దగ్గిరకు తీసుకు పోయాను. సమయానికి వైద్యుడు యింట





వుండడంతో చికిత్స జరిగి, మీ నాన్న నీకు దక్కాడు!'' అన్నాడు.

''మీ మేలు జన్మజన్మలకీ మరిచి పోలేను! మీరు, మా నాన్న ప్రాణాలు కాపాడారు; ఈయన నా ప్రాణదాత!'' అంటూ కళ్యాణి, సాగరుడిని వాళ్ళిద్దరికీ పరిచయం చేసి, జరిగినదంతా చెప్పింది.

రాజారాం, సాగరుడూ ఆ క్షణంలోనే ఆప్తమిత్రులయిపోయారు. ఆ సాయంత్రం వాళ్ళిద్దరూ షికారుగా నదికేసి వెళ్ళిన సమయంలో, బసవన్న కూతురుతో, ''ఈ నాటినుంచీ రాజారాం అనాథ కాదు; మనతోపాటే వుంటాడు. మీ ఇద్దరికీ పెళ్లి చెయ్యబోతున్నాను,'' అన్నాడు.

కళ్యాణి తెల్లబోయి, ''సాగరుడు నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు కదా!'' అన్నది.

''రాజారాం నా ప్రాణం కాపాడాడు. అతడికి నిన్నిచ్చి చేస్తాననీ, మాతోపాటే వుండిపొమ్మనీ చెప్పి, ఎంతో బతిమాలి తీసుకు వచ్చాను,'' అన్నాడు బసవన్న.

''మరి సాగరుడు నా ప్రాణదాతకదా!'' అన్నది కళ్యాణి.

బసవన్న కొంచెంసేపు ఆలోచించి, ''అయితే, అంతా నీ యిష్టానికే వదులుతున్నాను. నీ పెళ్లి ఎవరితో జరిగినా నాకు సంతోషమే,'' అన్నాడు.

కళ్యాణికి యీ చిక్కుముడి ఎలా విడదీయాలో అర్థం కాలేదు. ఆమె ప్రతి శుక్రవారం అమ్మవారి ఆలయానికి వెళుతూ వుంటుంది. తండ్రి క్షేమంగా తిరిగి వచ్చినందుకు, ఆ రోజు శుక్రవారం కాకపోయినా ఆలయానికి వెళ్ళాలనుకున్నది.

ఆలయం పూజారికి క్రమం తప్పకుండా వచ్చే కళ్యాణి అంటే ఎంతో వాత్సల్యం. ఆమె ముందు దేవీ దర్శనం చేసుకుని వచ్చి, పూజారికి తన కెదురైన సమస్య గురించి వివరంగా చెప్పింది.

''ఇది మొత్తం నీ భావిజీవితానికి సంబంధించిన అతిముఖ్య విషయం.

కనక, నీకై నువ్వే ఒక నిర్ణయానికి రావడం ఉత్తమం!'' అన్నాడు పూజారి.

''నిర్ణయం నాదే! అయితే, అది సరైనదో కాదో మీరు చెప్పాలి. రాజారాం మా నాన్న ప్రాణదాత, సాగరుడు నా ప్రాణదాత. వీళ్ళిద్దరిలో ఎవరిని చేసుకోవడానికైనా నేను సిద్ధమే. బాగా ఆలోచించాక నేను రాజారాంను చేసుకోవాలని నిర్ణయించుకున్నాను,'' అన్నది కళ్యాణి.

''అదేం! నీ ప్రాణాలకన్నా, మీ నాన్న ప్రాణాలు విలువైనవనా, నీ ఉద్దేశం?'' అని అడిగాడు పూజారి.

''ఇక్కడ ప్రాణాల విలువల్ని లెక్క కట్టడం లేదు. ఆ ఇద్దరికీ మేము ఆ జన్మాంతం కృతజ్ఞులం. నేను, మా నాన్న లేడనుకున్న క్షణంలో ఎంతో మానసిక క్షోభ అనుభవించాను. అందువల్ల, బాల్యం నుంచీ ఎవరి ఆదరణా లేకుండా బతికిన రాజారాం బాధ ఎలాంటిదో నేను అర్థం చేసుకోగలను. పైగా, అతణ్ణి మా నాన్న, మా అమ్మాయిని చేసుకోమని బతిమాలి వెంటబెట్టుకు వచ్చాడు. సాగరుడు కష్టంలో వున్న నన్ను చూసి జాలికొద్దీ, తనకు తానై నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు. అంతేగాని నేనతణ్ణి చేసుకుంటానని ఎలాంటి వాగ్దానమూ చెయ్యలేదు! కనక, నేను రాజారాంను వివాహమాడడమే ధర్మంగా వుంటుంది,'' అన్నది కళ్యాణి.

పూజారి తలవూపుతూ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

కళ్యాణి యింటికిపోయి, తన నిర్ణయం ఏమిటో తండ్రికి చెబుతూండగా షికారు వెళ్ళిన రాజారాం, సాగరుడు తిరిగి వచ్చారు. అంతా విన్న సాగరుడు మందహాసం చేస్తూ, ''కళ్యాణీ, నీది సరైన నిర్ణయం! రాజారాం లాంటి అదృష్టవంతులు బహు కొద్దిమంది వుంటారు,'' అన్నాడు.

బసవన్న, రాజారాంలకు కళ్యాణి నిర్ణయంకన్నా, సాగరుడి మాటలు మరింత ఆనందం కలిగించినై.



# కనకయ్య తెలివి

కనకయ్య వాళ్ళ ఇంటి బూజు దులపడానికి నిచ్చెన ఎక్కిన కుర్రవాడు, జారి కిందపడి, కాలు విరగ్గొట్టుకున్నాడు. అయితే, వాడు ఆ నిచ్చెన భుజాన వేసుకుని కుంటుకుంటూ గ్రామపెద్ద దగ్గిరకు పోయి, "అయ్యా, కనకయ్యగారు యింత పనికిమాలిన ఓటి నిచ్చెన యివ్వబట్టే, జారి కిందపడి కాలు విరగ్గొట్టుకున్నాను. కాలు నయం చేయించుకునేందుకు ఖర్చులగ్గాను నష్ట పరిహారం యిప్పించండి," అన్నాడు.

గ్రామపెద్ద కనకయ్యను పిలిపించి, పనికుర్రవాడి అభియోగం గురించి అడిగాడు.

కనకయ్య ఏ మాత్రం కంగారుపడకుండా, "ఈ పనికుర్రాడు అజాగ్రత్తవల్ల పడ్డాడే గాని, నిచ్చెన మహగట్టిది!" అంటూ దావులనున్న ఒక చెట్టుకు నిచ్చెన వేసి, గబగబా పైకెక్కాడు. అయితే కనకయ్య బాగా స్థూలకాయుడు కావడంతో నిచ్చెన ఫెళఫెళమంటూ విరిగిపోయింది.

"ఇప్పుడేమంటావు?" అన్నాడు గ్రామపెద్ద కోపంగా.

"నా అంత స్థూలకాయుడు ఎక్కడంవల్ల గదా, నిచ్చెన విరిగింది! ఈ కుర్రవాడెక్కితే విరగలేదు. అలాంటప్పుడు యిది ఓటి నిచ్చెన ఎలా అవుతుంది? లోపం కుర్రవాడిదే," అన్నాడు కనకయ్య.

గ్రామపెద్ద నష్టపరిహారం యివ్వనవసరం లేదని తీర్పు చెప్పి, పనికుర్రవాణ్ణి గట్టిగా మందలించి పంపేశాడు.

—ఎమ్. డి. సౌజన్య





# విఘ్నేశ్వరుడు

విఘ్నేశ్వర శిల్పంలోని దేవతావిగ్రహాల గానానికి తన్మయుడైన అగస్త్యుడు, "వాతాపి గణపతీ! నీ అద్భుత శిల్పాన్ని నీవే మలచుకొన్నావు! ఇటువంటి మహోన్నత శిల్పం చెక్కడం ఎవరితరం!" అన్నాడు.

అప్పుడు విగ్రహంలోనుంచి, "అగస్త్య మహర్షీ! నా కోసమని నేను శిల్పం మలచుకోలేదు, నీ తృప్తి కోసం నీ కోరిక నెరవేర్చాను, అంతే! అందువల్ల ఈ మహా శిల్పం కొంతకాలం మాత్రమే ఉంటుంది, అటు పిమ్మట అదృశ్యమౌతుంది! ద్వాపరంలో ధర్మరాజు అశ్వమేధయాగ సందర్భంలో, ఇదే స్థానంలో మరొక పెద్ద విగ్రహం ప్రతిష్ఠింపబడుతుంది!" అంటూ విఘ్నేశ్వరుని మాటలు వినిపించాయి - అని ధౌమ్యుడు అర్జునుడితో చెప్పి, "అర్జునా! ఆ మహా శిల్పాన్నే మనం చూస్తున్నాం," అని ఆగాడు.

అర్జునుడు మహాశిల్పం చుట్టూరా పలుమార్లు ప్రదక్షిణాలు చేసి, భక్తిశ్రద్ధలతో పరిశీలించాడు. మహాశిల్పం విఘ్నేశ్వరుడే. ఆ విఘ్నేశ్వరుడిని అంటిపెట్టుకొని త్రిమూర్తులు, జగదంబ, లక్ష్మిపార్వతీ సరస్వతులు, నవగ్రహాలు మొదలుకొని అనేకమంది దేవతలు మనోహరశిల్పాలుగా మలచబడ్డారు. విఘ్నేశ్వరుని రెండు పాదాల ఇరుకున విఘ్నం బంధింపబడి ఉన్నది, ఎలుకరాజు తోక విగ్రహం చుట్టూరా వలయం చుట్టి ఉన్నది. శిల్ప



శోభ తిలకించడానికి వేయికళ్ళున్నా చాలవు అనిపిస్తున్నది. తనివితీరా చూశాక అర్జునుడు ధౌమ్యుడితో, "ఆచార్యదేవా! ఇంతటి మహనీయశిల్పం చుట్టూరా నెలకొన్న వాతాపినగరం మహోన్నతదశ అనుభవించి యిప్పుడెందుకిలా ఉంది? వాతాపినగర గాథ వినాలని కుతూహలపడుతున్నాను!" అన్నాడు.

ధౌమ్యుడు తిరిగి చెప్పడం ప్రారంభించాడు :

అగస్త్యుడు లోపాముద్ర ఆదేశాను సారం ఏమీ మిగుల్చుకోకుండా, ఉంచిన ధనాన్ని అందరికీ పంచేసి, ప్రజారాజ్య పాలనా బాధ్యతలను పౌరధర్మాలను అనుసరిస్తూ సుఖజీవనం గడపండని ప్రజలకు చెప్పి, కట్టుబట్టలతో లోపాముద్రతో తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

విఘ్నేశ్వర మహాశిల్పమే ప్రజారాజ్య మకుటంగా ఆరాధించుతూ వాతాపినగర ప్రజలు చిరకాలం క్రమబద్ధంగా సుఖ జీవనం చేశారు. తరాలు మారాయి. ఆదర్శరాజ్యంగా, ప్రజారాజ్య మార్గదర్శకంగా దినదిన ప్రవర్ధనమానమై విస్తరించిన వాతాపినగరం దేశదేశాంతరాల్లో పేరు పొందింది.

అగస్త్యుడు తన్ను కూడా హతమారుస్తాడనే చావు భయంతో పారిపోయి, వింధ్యాటవుల్లో ఊరూ పేరూ లేని చీకటి బతుకు బతుకుతున్న ఇల్వాలుడు వాతాపినగరం పేరు ప్రఖ్యాతులు విని, అగస్త్యుడు అక్కడ లేడని తెలుసుకొన్న మీదట నయవంచనతో సాధించాలనే తలంపుతో, ప్రజాసేవనే జీవిత పరమార్థంగా పెట్టుకొన్న వాడిలాగ రూపు మార్చుకొని, వాతాపినగర ప్రజల మధ్యకు చేరాడు. అప్పటి పరిస్థితి కూడా ఇల్వాలుడికి అనుకూలంగా ఉంది.

క్రమక్రమంగా కాలమహిమవల్ల, వాతాపినగర ప్రజల్లో స్వార్థచింత అంకురించి పెరగసాగింది: కలిమిలేములు ప్రారంభమయ్యాయి. ప్రజల్లో భేదాభి

ప్రాయాలు, పొరపొచ్చాలు తలదాల్చాయి. తెలివితేటలు, తెలివి తక్కువవారిని వంచించడానికి పనికివచ్చాయి.

అలాంటి పతనదశ ప్రారంభంలో, ఇల్వలుడు ఒక ప్రజానాయకుడుగా తయారై ఇంద్రజాల విద్యలతో ఒక మహా పురుషుడుగా ప్రజలను ఆకట్టుకున్నాడు.

నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పం మీద ప్రజలకు గురి ఉన్నంత కాలం అగస్త్యుణ్ణి, అగస్త్యుడు చెప్పిన నైతిక సూత్రాల్ని మరచిపోరనే విషయం గుర్తించాడు. తాంత్రికవిద్యలు, మద్య పానీయాలు ప్రజలకు రుచిచూపించాడు. అగస్త్యుడు నాటించిన ప్రజారాజ్య సూత్రాల శిలాఫలకాలను ఊడబెరికించి, కొత్తకొత్త సూత్రాలు నూరిపోశాడు. ఒకరి నొకరు దోచుకోవడంలో ఉన్న ఆనంద విశేషాన్ని ప్రచారం చేశాడు. గిరిగీసుకొని కూచోడం మనిషిలక్షణం కాదనీ, కొత్త కొత్త సుఖాలు తెలుసుకోడానికే బ్రతకడం, అనే సిద్ధాంతానికి ప్రజల్ని మళ్ళించాడు. ప్రచ్ఛన్న వేషాలతో చాలామంది రాక్షసులు ఇల్వలుడికి తోడైనారు. ప్రజా సేవకుడుగా అవతరించి, ప్రజానాయకుడుగా తయారైన ఇల్వలుడు మహా నాయకుడై, ప్రజలపై అంకుశంగా మారాడు. అంతఃకలహాలు రేపాడు.



వాతాపినగరం కొట్లాటలతో నిండి పోయింది. దుర్మార్గులు అమాయకులను వేటాడుతున్నారు. నగరం అల్లకల్లోలమై పోయింది. చాలామంది ప్రజలు నగరం విడిచి వెళ్ళిపోయారు.

ఇల్వలుడు నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పాన్ని నేలమట్టం చేయాలని ప్రయత్నాలు ఆరంభించాడు. శతఘ్నుల్ని చుట్టూరా గురిపెట్టించాడు. శిల్పం అడుగు నేలలో ప్రేలుడుమందు దట్టింపించి, అగ్గి ముట్టించడమే తరవాయిగా ఉన్న సమయంలో, అతి విచిత్రంగా అద్భుతం జరిగింది. నిప్పు తగిలించకుండానే మందుగుండు



ప్రేలింది. శతఘ్నిశకటాలు అటు నుంచి ఇటు వెనక్కు తిరిగి ప్రేలి గుండ్లవర్షం కురిపించాయి. ఆ అగ్నివర్షంలో దుర్మార్గులంతా మరణించారు. చాలా మంది వికలాంగులయ్యారు. వారిలో ఇల్వలుడు కూడా ఒకడు. ఇల్వలుడి ఒక కాలు, ఒక చేయి పోయింది. రక్తసిక్తమైన దేహంతో నేల దొర్లుతూన్న సమయంలో, ఇల్వలుడికి విగ్రహం నుంచి మాటలు వినిపించాయి.

''ఓరీ, ఇల్వలా! అంగవైకల్యంతో, ముసలితనంతో చివికి చివికి కుళ్ళుతూ చిరకాలం జీవించు! నీకు అదేసరియైన శిక్ష!'' అని విఘ్నేశ్వరుడు శపించాడు.

వాతాపినగరం క్రమంగా తన పూర్వ వైభవాన్ని కోల్పోయి, కొద్ది మంది మనుష్యులతో మాత్రమే ఇప్పుడిలా బీడు పడిపోయింది, అని ధౌమ్యుడు చెప్పడం ముగించాడు.

అర్జునుడు అంతా విని అటు తిరిగి చూసి, ఆశ్చర్యంతో నోటమాట రాక అలా ఉండిపోయాడు. విఘ్నేశ్వర మహాశిల్పం కనిపించలేదు!

''అర్జునా, ఆశ్చర్యపడకు! మహాశిల్పం అదృశ్యమైపోతుందని యిదివరకే వింటివి కదా!'' అని ధౌమ్యుడు అంటూండగా ఆ చుట్టుపక్కల ఉన్న ఒక ముళ్ళపొదలో, ఒక పండుముసలి వికృతరూపుడు ఒక చేయి, ఒక కాలుతో నేల మీద శరీరాన్ని యీడ్చుకొని వస్తూ కెవ్వున అరిచి, మహాశిల్పం ఉండిన వేపు చేతులు చాచి జోడించి గిలగిలలాడుతూ చనిపోయాడు.

అర్జునుడు అది చూసి ఆశ్చర్యపోతూ, ''గురుదేవా! వాడే కదా ఇల్వలుడు!'' అన్నాడు.

ధౌమ్యుడు, ''ఔను, ఎప్పటికైనా దుర్మార్గులు అలాగే నశిస్తారు!'' అన్నాడు.

వార్తాహరుల చేత వాతాపి నగరానికి బయలుదేరి రమ్మని అర్జునుడు ధర్మరాజుకు కబురుపంపాడు.

హస్తినాపురం నుండి ధర్మరాజు భీమ, నకుల, సహదేవులతో వాతాపి నగరానికి వచ్చాడు.

ఆ రాత్రి ధర్మరాజు విఘ్నేశ్వర మహా శిల్పం అంతర్ధానమైన ప్రదేశానికి ఎదురుగా కూర్చొని, "నా తమ్ముడు నీ మహా శిల్పం దర్శించాడు, దేవా! నాకూ ఆ భాగ్యం కల్గించవా? నీ మహనీయ శిల్పాన్ని ఎవరు చెక్కుతారు! సత్వరమే నీ విగ్రహ ప్రతిష్ఠ జరిపించే మహా భాగ్యాన్ని నాకు కల్గించు!" అని కన్నులు మూసి విఘ్నేశ్వరుని ధ్యానిస్తూ వేడుకొన్నాడు.



అప్పుడు అతని చెవుల్లో, "ధర్మజా! దేవశిల్పి విశ్వకర్మ, దానవశిల్పిమయుడు కలసి శిల్పులుగా వచ్చి విగ్రహాన్ని చెక్కుతారు. విగ్రహ ప్రతిష్ఠ జరిగిన వెంటనే యాగాశ్వం కదలివెళ్తుంది. నీ అశ్వమేధ యాగం జయప్రదంగా జరుగుతుంది. వాతాపినగరాన్ని పునరుద్ధారణ చెయ్యి! మీ పాండవ సంతతివారైన చంద్రవంశ రాజులు చిరకాలం ఈ నగరాన్ని పాలిస్తారు!" అనే వాక్కులు వినిపించాయి

ధర్మరాజు కళ్ళు తెరిచేసరికి ఎదురుగా మహోన్నతంగా విఘ్నేశ్వర మహాశిల్పం దేదీప్యమానంగా కనిపించి అంతర్ధానమైంది.

మర్నాటి ఉదయం ఒక తెల్లనివాడు, ఒక నల్లనివాడు ఆ దరిదాపుల్లో పొదల మధ్య ఉన్న పెద్ద స్ఫటికశిలను పరీక్షిస్తూ కనిపించారు. వారెవరైనదీ గ్రహించి ధర్మరాజు వారికి మ్రొక్కి మర్యాదలు జరిపాడు.

ఆ శిలను పెకలించడానికి తవ్వుతున్నప్పుడు, అక్కడ గొప్పనిధి దొరికింది. ఆ బంగారాన్ని ఇల్వలుడు నిక్షిప్తపరిచాడు. ఆ చోటు వదల్లేక చివికి చివికి వాడు చివరకు మరణం పాలయింది కూడా అక్కడే.

ధర్మరాజు ఆ నిధిని వాతాపినగర అభివృద్ధికి వినియోగించాడు.




ఇద్దరు మహాశిల్పుల చేతుల మీదుగా విఘ్నేశ్వరుని విగ్రహం, మహాశిల్పం అదృశ్యమైన చోటనే గొప్ప ఆలయము, పెద్ద మంటపము తయారైనాయి. విశ్వకర్మ మయుల శిల్పరీతుల అద్భుత సమ్మేళనంతో ఒక గొప్ప శిల్ప సాంప్రదాయానికి నాంది అయింది. భరతవంశం వారిచే నెలకొల్పబడినందువల్ల అది భారతీయ శిల్పంగా పేరొంది, కాలాల తరబడి గొప్ప ప్రఖ్యాతి పొంది చిరస్థాయిగా వర్థిల్లింది.

ఆ విధంగా విఘ్నేశ్వర శిల్పం పూర్తి చేసి శిల్పులిద్దరూ ఎలాగ వచ్చారో అలాగే మాయమయ్యారు.

ఆలయంలో ధర్మరాజుచే విఘ్నేశ్వర విగ్రహప్రతిష్ఠ జరిగిన వెంటనే గుర్రం దౌడు తీసి పరుగెత్తింది. అర్జునుడు, భీముడు సైన్య సమేతంగా దాని వెనక బయలుదేరారు.

ధర్మరాజు అగస్త్యుడు ఏర్పరిచిన ప్రజా రాజ్య పద్ధతులతో వాతాపినగర పాలన సాగేలా పాలనాదక్షత ఏర్పాటు చేసిన తరువాత నకుల సహదేవులతో హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.

ప్రజారాజ్య పర్యాయపదంగా ఆ ప్రాంతం అగస్త్యరాజ్యమనీ, నగరం అగస్త్యనగరమనీ, కొంతకాలం పేర్కొనబడినవి. కాలక్రమాన వాతాపినగరం అనే పేరే స్థిరంగా నిలిచిపోయింది.

అర్జునుడు దిగ్విజయాన్ని ముగించుకొని గుర్రంతో హస్తినాపురం చేరాడు. అశ్వమేధయాగం జరిగింది. ధర్మరాజు యాగభాగాలను, విశ్వకర్మకూ, మయుడికీ ప్రత్యేకంగా అర్పించాడు. శిల్పులకు శిల్పానికి గౌరవ ప్రపత్తులు చేకూర్చాడు.

ధర్మరాజు తర్వాత పరీక్షిత్తు, పరీక్షిత్తు తర్వాత జనమేజయుడు పాలించారు. జనమేజయుడి సంతతి వారైన రాజులు వాతాపినగరాన్ని పాలించసాగారు.

వాతాపినగరాన్ని పాలించిన చంద్రవంశరాజులలో శత్రుంజయుడు గొప్ప

సామ్రాజ్యపిపాసి. వాతాపి నగరం రాజధానిగా వాతాపి సామ్రాజ్యాన్ని స్థాపించాడు. సైన్యాల్ని పెంచడానికి ప్రజల మీద విపరీతంగా పన్నులు వేశాడు. నిరంకుశ పాలన సాగిస్తూ, ఇల్వలుడు మళ్ళాపుట్టాడు అని అనిపించుకున్నాడు.

అతని కుమారుల్లో కడపటివాడైన చళుకవర్మ చాలా మంచివాడు. అగస్త్యుడి ప్రజారాజ్య సూత్రాలపై గురిగలవాడు. విఘ్నేశ్వరుణ్ణి భక్తితో ఆరాధిస్తూ, విద్య పట్ల, కళలపట్ల ఆసక్తితో ఉండేవాడు. అగస్త్యుడి అంశ అతనిలో ఉన్నదని ప్రజలు అనుకునే విధంగా ప్రజాభిమానాన్ని సంపాదించాడు.

సామ్రాజ్య విస్తరణకు శత్రుంజయుడు కుమాళ్ళను ఆయత్తం కమ్మన్నాడు. చళుకుడు తండ్రితో, "జనహింస పరపీడనతో కూడిన సామ్రాజ్య విస్తరణ కసాయి వృత్తికంటే ఏం గొప్పది?" అని అన్నలతో కలిసి దండయాత్రకు వెళ్ళడం మానేశాడు.

శత్రుంజయుడు మండిపడుతూ, "ఔరా! సింహం కడుపున ఎలుకపుట్టినట్లు రాజవంశంలో తప్పపుట్టావు! నీకు తగిన శాస్తి జరగాలి!" అని అంటూ ఒక ఎలుకను పట్టి తెప్పించి, దానికి చుళుక అని పేరుపెట్టి, దానితో చళుకవర్మకు పెళ్ళి అని చాటించాడు.

చుళుక అసలుపేరు కళ్యాణకింకిణి! ఒక అప్సరస. ఇంద్రుడి శాపం వల్ల ఎలుకగా భూమ్మీద పడింది.

కళ్యాణవేదికపైన వున్న పెళ్లిపీటలపై రాకుమారుణ్ణీ, ఎలుకనూ చూసి, వచ్చిన వారు చేసే కోలాహల పరిహాసానికి చళుకుడు సిగ్గుతో కృంగిపోవాలని శత్రుంజయుడు, ఆ విచిత్ర వివాహానికి రాజుల్నీ, ప్రజల్నీ ఆహ్వానించాడు. కాని చళుకవర్మ మందహాసంతో, "ఎలుకను మహారాజు కోడలుగా చేయించగల విఘ్నేశ్వరుడు, ఎలుకను చిలుకల కొలికిగా చేసినా చేయవచ్చు, అని మీరంతా నమ్మకపోవచ్చును గాని, నేను నమ్మగలను!" అన్నాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 8

వృద్ధుడి మాటలతో మరింత దుఃఖపడి పోతూ హసన్ ఆయన కాళ్ళపై పడి తనకు భార్యాదానమూ, పుత్రదానమూ చెయ్యమని ప్రార్థించాడు.

"చావటానికి నీలాగా ఆత్రపడేవాణ్ణి నేనెక్కడా చూడలేదు. నీవు తలపెట్టిన పని ఎంత ప్రమాదకరమైనదీ నీకు కొంచెం కూడా తెలియదు. అయినప్పటికీ నా చేతిలో ఉన్న సహాయమంతా నేను చేస్తాను," అంటూ వృద్ధుడు తన గడ్డం నుంచి కొన్ని వెంట్రుకలు పీకి హసన్ కిచ్చి, "నీకు ప్రాణం మీదికి వచ్చినప్పుడు ఈ వెంట్రుకలలో ఒకటి తీసి కాల్చి నట్టయితే నేను తక్షణం వచ్చి నీకు సహాయం చేస్తాను," అన్నాడు.

తరవాత ఆయన తల ఎత్తి పైకి చూసి చప్పట్లు చరిచాడు. వెంటనే ఒక భూతం వారి ఎదట ప్రత్యక్షమయింది. వృద్ధుడు హసన్‌తో, "వీడి వీపు మీద సవారీ అయి వెళ్ళు. వీడు నిన్ను కర్పూరద్వీపం మీద దించుతాడు. ఆపైన నీ దారి నీవే చూసుకోవాలి. కర్పూరద్వీపం గడిచి అవతలి చివరకు వెళ్ళితే వాక్ - వాక్ దీవులుండే సముద్రం యొక్క ఇవతలి తీరం చేరుకుంటావు. ఆ తరవాత భగవంతుడే ఉన్నాడు," అన్నాడు.

హసన్ వృద్ధుడికీ, మిగిలిన వారికీ నమస్కారాలు పెట్టి భూతం వీపు మీద ఎక్కి కూచున్నాడు. భూతం ఆకాశ మార్గాన ప్రయాణించి అతన్ని కర్పూర ద్వీపం మీద దించి తన దారిన తాను వెళ్ళిపోయింది. నిగనిగా మెరుస్తూ, సువాసన వెదజల్లే ఆ కర్పూరద్వీప మైదానం మీద పడి హసన్ నడవసాగాడు.



"ఈ పక్షి చిత్రంగా కూస్తుందే! దీన్ని మా రాజుగారికి బహుమానం ఇస్తాను," అనుకున్నాడు మహాకాయుడు.

కర్పూరద్వీపపు రాజు ఒక రాతి మీద కూచుని ఉన్నాడు. ఆయన కూడా హసన్‌ను చూసి ఏదో పిట్ట అనీ, "రక్షించండి! కాపాడండి!" అని అతను అరిచే అరుపులు కూత అనీ అనుకుని చాలా ముచ్చటపడ్డాడు. ఆయన ఒక పంజరంలో హసన్‌ను పెట్టి అతనికి నీరూ, ఆహారమూ యిస్తూ, తన ఇంట వేళ్ళాడగట్టాడు.

కొంతదూరం వెళ్ళేసరికి అంతదూరాన అతని కొక గుడారు లాటిది కనబడింది. ఎత్తయిన గడ్డి మధ్యగా అతను దాని కేసి నడుస్తూ, కాలికి ఏదోతగిలి పడిపోయాడు.

హసన్‌కు తగిలినది ఒక మహాకాయుడి శరీరం. అతనికి గుడారం లాగా కనిపించినది ఆ మహాకాయుడి చెవి. ఆ మహాకాయుడు నిద్రపోతూ, హసన్ తన పైన పడగానే పెద్ద పెడ బొబ్బపెట్టి తాటిచెట్టు ప్రమాణాన లేచి నిలబడి, హసన్‌ను పిచ్చికను పట్టుకున్నట్టు పట్టుకుని పైకెత్తాడు.

హసన్ భయంతో గిలగిలా కొట్టుకుంటూ, "రక్షించండి! కాపాడండి!" అని పెద్దగా కేకలు పెట్టాడు.

రోజులు గడిచాయి. హసన్ పంజరంలో చిక్కి పాలిపోయి నీరసించసాగాడు. చివరకు అతనికి ప్రాణాపాయస్థితి కూడా ఏర్పడింది. ఆ స్థితిలో అతనికి వృద్ధుడి వెంట్రుకలు జ్ఞాపకం వచ్చాయి. రాజు కూతురు అతన్ని ఆడించటానికి పంజరంలో నుంచి బయటికి తీసినప్పుడు అతను ఆమె పట్టు తప్పించుకుని వెళ్ళి వృద్ధుడి వెంట్రుక ఒకటి కాల్చాడు.

వెంటనే వృద్ధుడు ప్రత్యక్షమై, "ఏం కావాలి, హసన్?" అని అడిగాడు.

"నన్నిక్కడి నుంచి మరెక్కడికైనా చేర్చండి. ఇంకొక్క రోజు గడిస్తే నా ప్రాణాలు దక్కేలాగు లేవు," అన్నాడు హసన్ దీనంగా.



"నేను చెప్పాను కానా? ఇంకా అవగింజలో అర భాగం కాలేదు. ఇక్కడ గనక నా వెంట్రుక కాల్చి నన్ను పిలవ గలిగావు. వాక్-వాక్ దీవులలో ఏ ఇతర మంత్రాలూ, తంత్రాలూ పారవు. అక్కడ నీకు భగవంతుడే దిక్కు. నీవీ ప్రయత్నం ఏనాడో మాని ఉండవలిసింది" అన్నాడు వృద్ధుడు.

"నా ప్రయత్నంలో చస్తే చస్తాను. దానికి నేను సిద్ధంగానే ఉన్నాను. చావు అన్నది రాసి పెట్టి ఉన్నప్పుడే వస్తుంది గాని ముందే వచ్చెయ్యదు గదా! నా భార్య కోసం వెళ్ళటం ఎలా మానుకుంటాను? దయచేసి నాకు ముందు దారి చెప్పండి," అన్నాడు హసన్.

వృద్ధుడు హసన్ చెయ్యి పట్టుకుని, "నీ కళ్ళు ఒక్కసారి మూసి తెరు," అన్నాడు. హసన్ కళ్ళు మూసి తెరిచే సరికి అతను ఒక సముద్రం ఒడ్డున ఉన్నాడు. వృద్ధుడి జాడ లేదు. అతను నిలబడిన తీరాన అనేక రంగుల రత్నా లున్నాయి.

అతను ఒక్కసారి చుట్టూ కలయ చూశాడో లేదో, సముద్ర తీరాన ఉండే కొండల మీది నుంచి పెద్ద ఆకారం గల పక్షులు, "వాక్ - వాక్" అని అరుస్తూ తూగిడీలు తూగిడీలుగా లేచాయి.

తానున్నది వాక్-వాక్ దీవులలో చేరి నదేనని హసన్ గ్రహించాడు. ఈ పక్షులు తనను సముద్రంలోకి తోసేలోపునే ఎక్కడైనా దాక్కోవాలని చూసేసరికి అతని అదృష్టవశాత్తూ దగ్గిరలోనే ఒక గుడిసె కనిపించింది. కాని అంతలోనే భూమి దద్దరిల్లింది. అంత దూరాన ధూళి లేచింది. ఆ ధూళి మేఘం తానున్నవేపే వస్తున్నది. త్వరలోనే అతనికి ఆ మేఘంలో మెరుపుల్లాగా ఈటెల కొసలూ, శిరస్త్రాణాలూ, కవచాలూ కనిపించాయి. ఆ వచ్చేది భయంకరమైన యోధకన్యలు!

వారు పెద్ద పెద్ద గుర్రాలెక్కి, కత్తులు ధరించి, వాయువేగంతో అతనున్న చోటికి



వచ్చారు. వారి నుంచి హసన్ తప్పించుకుపోయే మార్గం లేదు. అతను గుడిసె వాకిట నిలబడ్డాడు. అతన్ని చూడగానే గుర్రాలన్నీ నిలిచిపోయాయి. యోధకన్యలలో ఒకతె తన గుర్రాన్ని హసన్ సమీపానికి నడిపించుకుంటూ వచ్చింది. ఆమె ముఖానికి కూడా కవచం ఉండటం చేత దాన్ని అతను చూడలేకపోయాడు. ఆమె ఏమీ అనక ముందే అతను నేలపై ఆమె ముందు సాష్టాంగపడి, "దేవీ, నేను విధి వశాన ఈ దీవికి వచ్చాను. నీ శరణు జొచ్చాను. భార్యనూ, బిడ్డలనూ వెతుక్కుంటూ వచ్చిన ఈ నిర్భాగ్యుడిపై దయతలిచి అభయం ఇయ్యి," అన్నాడు.

ఆమె తన గుర్రం మీది నుంచి దిగి, ఒక్క చేతి ఊపుతో తన అనుచరులను పంపేసి, అతని కేసి పరీక్షగా చూసి, తన ముఖానికి అడ్డంగా ఉన్న కవచభాగాన్ని తొలగించింది. ఆమె ముఖం చూసి భయపడి హసన్ కెవ్వున అరిచాడు. యోధ కన్యలు చాలా అందకత్తెలని ప్రతీతి. ఈమె ఎంతో ముసలిదే కాక అందవికారంగానూ, భయంకరంగానూ ఉన్నది.

తనను చూసి హసన్ కళ్ళు మూసుకున్నది భయంతోనని తెలియక, తనపై గల గౌరవం కొద్దీ అనుకుని ముసలిది "భయపడకు, నాయనా! నిన్ను నేను రక్షిస్తాను. నీకు కావలిసిన సహాయమంతా చేస్తాను. కాని ముందు నిన్నెవరూ చూడకుండా చూడాలి. అందుచేత నీకు యోధ కన్య దుస్తులు తెచ్చి యిస్తాను. వాటిని ధరించు. ఆ తరవాత నీ కథ సావధానంగా వింటాను," అన్నది.

ఆమె వెళ్ళి త్వరలోనే యోధకన్యలు ధరించే కవచాలూ మొదలైన వాటితోనూ, ఆయుధాలతోనూ తిరిగి వచ్చింది. అవన్నీ ధరిస్తే హసన్ కూడా యోధ కన్యలాగే ఉన్నాడు. ముసలిది అతన్ని సముద్ర తీరాన ఉన్న ఒక రాతిపై కూచోబెట్టి, తాను కూడా కూచుని అతని కథ అంతా సమగ్రంగా విన్నది. విని అతని భార్య

పేరూ, కుమాళ్ల పేర్లూ అడిగింది. అతను వారి పేర్లు చెప్పి, "వాళ్ళనిక్కడ ఏ పేర్లతో పిలుస్తారో తెలియదు," అన్నాడు.

ముసళిదానికి హసన్‌పై మాతృప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, "హసన్, తల్లి తన బిడ్డ కోసం చెయ్యదగినదంతా నేను నీ కోసం చేస్తాను. నీ భార్య ఈ యోధకన్యలలో ఒకతె అయి ఉంటుంది. రేపు స్నానాలకు ఇక్కడికి వచ్చినప్పుడు నీవు వారందరినీ చూసి వారిలో నీ భార్యను గుర్తుపట్టగలిగితే నీ పని తేలిక అవుతుంది," అన్నది.

ఆమె అన్నట్టే, మర్నాడు యోధకన్యలు సముద్రంలో స్నానం చెయ్యటానికి కవచాలూ, శిరస్త్రాణాలూ లేకుండా వచ్చినప్పుడు, మారు వేషంలో ఉన్న హసన్ వారినందరినీ చూశాడు. కాని, వారిలో అతని భార్య లేదు.

అందరూ స్నానాలు చేసే సమయంలో హసన్ ముసలిదానికి ఈ మాట చెప్పగానే ఆమె కంగారుపడి, "అయ్యో, హసన్, ఇంక మిగిలినది మా చక్రవర్తి గారి ఏడుగురు కూతుళ్ళు మాత్రమే. వారిలో ఒకతె నీ భార్య అయిన పక్షంలో నీవూ, నేనూ కూడా హతాశులమే. నువు వెతికేది నీ భార్యను కాదు, నాయనా, మృత్యువును! ఈ ప్రయత్నం ఇంక మాని నీ ఆశ నిరాశ చేసుకో!" అన్నది.

"అమ్మా, ఇంతదూరం వచ్చి ఇప్పుడు వెనక్కు మళ్ళనా? నీ సహాయం మీద ఎంతో ఆధారపడ్డాను. ఇప్పుడు నేను అపజయం శంకించానంటే అది నీ శక్తి సామర్థ్యాలను శంకించటమే గదా! ఈ ఏడు దీవులూ నీ రక్షణలో ఉండగా నీకు అసాధ్యమంటూ ఉంటుందా?" అన్నాడు హసన్.

"నాకున్న అధికారం ఈ దీవులను కాపాడే యోధకన్యల పైన. వారిలో నీ యిష్టం వచ్చినదాన్ని కోరుకో, ఇచ్చేస్తాను. ఆమెను తీసుకుపోయి సుఖంగా ఉండు. కాదన్నావో మన యిద్దరికీ విపత్తుతప్పదు!" అన్నది ముసలిది. —(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.







M. Natarajan — Prabhakar Mahadik

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మే నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పైసా బేరం లేదండి....

రెండవ ఫోటో : వస్తున్నామండండి!

పంపినవారు : ఎస్. శీతల్, ధవళేశ్వరం.

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26



# చందమామ



మీకు అత్యంత అష్టమైన
చందమామ
క్లాసిక్స్ అండ్ కామిక్స్
తెలుగులో కూడా వస్తూంది త్వరలో






















ప్రచురణతేదీ కోసం ఎదురుచూడండి